శ్రీః

# కబీరు వాణి

అనుసృజన

డా॥ శ్రీమతి యస్. లలితారాణి
*M.A., Ph.D.*



ప్రకాశకులు

## శ్రీ సదాశివబ్రహ్మేంద్రాశ్రమము

చిల్లకల్లు-521 178, జగ్గయ్యపేట మండలం, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్.



శ్రీః

## కబీరు వాణి

అనుసృజన

డా॥ శ్రీమతి సూర్యదేవర లలితారాణి
*M.A., Ph.D.*


ప్రథమముద్రణ : వికృతినామ సంవత్సర 'శంకర జయంతి' పర్వదినం ది.18-05-2010

ప్రతులు : 500

పేజీలు : 128

వెల రూ. : 50-00





***D.T.P. by :-***
**J. RAJA**
18, Banam Complex,
Munthavari Centre, Chirala.
Cell : 98483 90564

***Printed at :-***
**KARSHAK ART PRINTERS**
HYDERABAD.



**డా॥ శ్రీమతి సూర్యదేవర లలితారాణి,**
***M.A., Ph.D.***
Brindavan Nagar,
4th Cross, Anjaiah Raod,
ONGOLE - 523 002
Phone : 94415 22693

# కాలాతీత వ్యక్తి... కబీరు

***అతని అక్షరాలు – శ్వాసిస్తాయి ...!***
***అతని వాక్కు – సమాజాన్ని శాశిస్తుంది ...!!***
***సర్వజనుల సుఖాన్ని, సమత్వాన్ని కాంక్షిస్తుంది...!!!***

***అతను రాజులకు రాజు ... రారాజు...!***
***యోగిపుంగవులకన్న సమున్నతుడు ... పరమహంస...!!***
***ఉనికి భూతలమైనా... మనికి ఆ పరాత్పరుని యందు ....***
***మనసులో ... సంశయానికి తావులేదు ...!***
***మాటలో ... ద్వివిధ లేదు ...!!***
***తాను నమ్మిన ప్రశస్తమైన వెలుగుబాటన సాగిన ప్రయాణం ...***
***"తొలి సంజెలో తెల్వి దూకి వచ్చిన యట్లు" తాను తొలిపొద్దు కిరణమై***
***ఇహపర జీవనానికి తీరైన త్రోవజూపిన క్రాంతి దాత ...!!***
***అతడు ... "కబీరు"...! ... కాలాతీత వ్యక్తి ...!!***

ఒక్క మానవత్వానికి తప్ప, ఏ కాలానికీ, ఏ సమాజానికీ ఒదగని విరాట్ తత్త్వం. ఏ బంధనాలకీ కట్టుబడని ఉన్ముక్తు డాతడు. అతని ప్రఖరమైన వ్యక్తిత్వం – ఆతని మాటకు "మెఱుపు" నిచ్చింది ...!

నేర్పరియైన విలుకాని బాణమై దూసుకుపోయి లక్ష్యాన్ని గురిచూసి కొట్టింది.

వీరుని ఖడ్గ ప్రహారమై, ఒక్క వేటుతో అజ్ఞానాన్ని ముక్కలు చేసింది.

సమకాలీన సమాజంలోని, సంప్రదాయాల్లోని, మతాచారాల్లోని, డొల్లతనాన్నీ, మిథ్యాతత్త్వాన్నీ, సంకీర్ణతనీ, స్వార్థాన్నీ, నిస్సిగ్గునూ నిష్పాక్షికంగా ఎండ గట్టింది.

ఆతడు నిర్భయుడైన సత్యవాది ... అసత్యమన్న ఏవగింపు ...

ఆ ఏవగింపును ఏమాత్రం దాచుకోడు కూడా ...!!

*जो तूं बांभन बंभनी जाया - तौ आन बाट ह्वै क्यों नहीं आया ।*
*जो तूं तुरक तुरकनी जाया - तौ भीतर खतना क्यों न कराया ॥*



***నేను బ్రాహ్మణ్ణి ..., బ్రాహ్మణ్ణి ... అంటావు .... అందరి లాగానే జన్మించావు .... వేరు మార్గాన పుట్టావా ఏమిటి ...? నేను 'తురకనీ'..., 'తురకనీ' ... అంటావు ... అమ్మ పొట్టలోనే "సున్నత్" చేయించుకోకపోతివే ...??*** *అని అడగ గలిగాడు.*

*माटी कहे कुम्हार से - तू क्या रौंदे मोय ।*
*एक दिन ऐस होवेगा - मैं रूँदूँगी तोय ॥*

*అడుసు త్రొక్కే కుమ్మరితో "మట్టి" అంటున్నది ...* ***నన్ను కాళ్ళ క్రింద వేసి... మహా త్రొక్కేస్తున్నావు... నీవు నన్ను త్రొక్కేదేమిటి...? పోఁ!! ...ఒకనాటికి*** *(నీవు మరణించి మట్టిపాలైననాడు)* ***నేనూ... నిన్నిలాగే నలిపివేస్తాను... జాగ్రత్త...!!*** *అందుకే అంటాడు –*

*दुर्बल को न सदाइये - जाकी मोटी हाय ।*
*मुई खाल की सांस से - लोह भस्म ह्वै जाय ॥*

***బలమున్నదని బలహీనుని పీడించక! వాడి ఉసురు తగిలి తీరుతుంది! కొలిమి తిత్తి ప్రాణం లేనిదే ... అయినా అది లోహపు ముద్దని భస్మం చేస్తుంది.***

బాణీలో నిర్మోహమాటం ... మాట విరుపులో వ్యంగ్యం ... తగినవారికి తగిలే కొఱడా దెబ్బ. కబీరు సమన్వయవాది. సమకాలీనవైషమ్యాలను రూపుమాపటానికి సామాన్య జనావళిని **సమత్వం, సత్యాచరణం, సత్యజీవనం** వైపు మళ్ళించాడు – తన దివ్య సందేశం ద్వారా !! ఆయన సాధన వైయక్తికం, ఐనప్పటికీ అది పరిధులుదాటి విస్తరించింది – సమస్త మానవహితాన్ని సమాహితం చేసికున్నది...!!

ఇతరుల అజ్ఞానాన్ని చూచి దుఃఖించింది ..., వారిని మేలుకొలిపి వెలుగుమార్గం వైపు మళ్ళించాలని పరితపించింది.

*सुखिया जब संसार है खावै अरु सोवै ।*
*दुषिया दास करीर है जागै अरु रोतै ॥*

***పరమాత్మ నెఱుఁగని ఈ జనాలు – సుఖంగా తింటున్నారు ... నిద్రబోతున్నారు... పరమాత్మ నెఱింగిన కబీరు – ఆతని చేరలేక దుఃఖిస్తున్నాడు.***

పరమాత్మ నెఱుగని ఈ మనుషుల ఎడ కబీరు పరిమితమైన జాఁలి. వారి చేయిపట్టి రాదారి నడిపించుతాడు. సామాన్యుడికి ఆ పరమాత్మ అద్వైతరూపాన్ని అలతి అలతి మాటలతో అవగతం కావిస్తాడు –

*जल में कुंभ, कुंभ में जल है, बाहर भीतर पानी ।*
*फूटा कुंभ, जल जलहि समाया । इहि तत कथ्यौ ब्रह्मग्यानी ॥*

***నీటిలో మట్టి కుండను ముంచావు. కుండలోనూ ... బయటా నీరే ...! కుండ పగిలిందా ... ఆ నీరూ... ఈ నీరూ ఏకమయ్యేను. మన్నులో కలిసిపోయే శరీరానికి***

***ప్రతీక మట్టికుండ. కుండలోని నీరు ఆత్మ, బయట వ్యాపించి ఉన్న నీరు పరమాత్మ. కుండ పగిలిననాడు, శరీరము నశించిననాడు... ఆత్మ పరమాత్మతో లయించిపోతుంది– ఇదియే బ్రహ్మజ్ఞానమన్నాడు కబీరు.***

***'తేరా సాయీం తుఝ్ మే'–*** *నీ సాయి నీలోనే ఉన్నాడన్న నిజాన్ని తెలిపి చెప్తాడు.*

*तेरे राम भरोसे तन, धनं, मन कोवूँ न छोड डिया ।*

***ఆ రాముని మీద నమ్మకముంచి నీ తనువూ, మనసూ, ధనమూ ఆతని కర్పించమని ఉద్బోధిస్తాడు.***

ఆ చందాన కబీరు ఇహపరలోక జీవనానికి తీరైన త్రోవచూపేటి వెలుగుదివ్వె అయినాడు. కబీరు జ్ఞాని ... ఆధ్యాత్మికుడు ... తాత్త్వికుడు ... యోగి ... అన్నింటికీ మించి మహాభక్తుడు.

***"నిను పేరిడి, పెంచిన వారెవరే రామా! సర్వ మతములకూ సమ్మతమైన నామము!"*** అంటూ గొప్ప ఆర్తితో త్యాగరాజస్వామి పలుకరిస్తారు ...!

కబీరు – రాముడు 'దశరథనందనుడు' గాదు 'న దశరథనందను రామ్' ... రామానందస్వామి ప్రసాదిత 'రామ' నామ మంత్రోచ్చాటనతో ఆ నిరాకార నిర్గుణ పరబ్రహ్మ రూపాన్ని అవగతం చేసికున్నవాడు, చివరకు "నిర్గుణ్ సగుణ్ కే పరే – తిహ హమారా ధ్యాన్" సగుణ, నిర్గుణాల కతీతుడై – అవ్యయాత్మకుడైన ఆ పరంధాముని యందు ధ్యాస నిలిపాడు. ఇహ ఆతనికి ... ఆ పరమాత్మ యొక్కడే పరమ పురుషుడు ...! కడమ దంతయు నారీతత్వమే ...!! ఆ ప్రియతముని జేర విరహిణి ఆత్మకెంత ఆతురత...!! దుస్సహ మీ వియోగము ...

*आ षडिया झायी पडी - पंथ निहीरि निहारि ।*
*जी भडियाँ छाला पडिया राम पुकारि पुकारि ।।*

***ప్రియాగమనం కోసం ఎదురుచూస్తున్న కన్నులు కాయలు కాస్తున్నాయి... నా రాముని పిలుస్తూ ... జపిస్తూ నా నాలుక పుండ్లు పడిపోతున్నది ... ఇకనైనా నా స్వామి నను చేఅ రాడేమి ...!***

ఎంతటి దుఃఖాతిశయము ... పరమపదసన్నిధానమునకు ఈ మాధుర్యభక్తి సోపాన మయింది ... ఆ పరమహంసకు అద్వైతసిద్ధి గలిగినది ...!

*तू तू करता तू भया, - मुझ में रही नहूँ ।*
*बारी फेरी बलि गयीं - जित देखू तित तू ।।*

***హే ప్రభూ...! నీ నామస్మరణ చేస్తూ నేను నీవయ్యాను ఇప్పుడిక నేను లేను ... 'అహ' మన్నది లేదు ... ఎక్కడ చూస్తే అక్కడ నీవే ...!!***



**"సర్వం ఖల్విదం బ్రహ్మ"** – ఋషి వాక్కు

సర్వవ్యాప్తమయియున్న ఆ మనోహరుని సౌందర్యఝరిలో తాను మునిగిపోయి తన అస్థిత్వాన్నే కోల్పోయాడు. స్వయంగా అద్వైతుడయినాడు ...! ఆ అపరిమితానంద అనుభూతిని తన పరిధిలోకి సమాహితం చేసుకున్నాడా... లేక ... తానే అపరిమితుడై, అనంతుడయినాడా ...!!

*लाली मेरा लाल की जित देखूँ तित लाल ।*
*लाली देखन मैं गयी - मैं भी ह्वै गयी लाल ।।*

***నా స్వామిని తేరిచూడ నేను చనినాను ... తీరా ఎక్కడ చూచినా నా వాడే ... ఆతని జూడ నే వెళితే ... నేను కూడా 'ఆతనయ్యాను'*** *(అతనిలో లీనమయ్యాను).*

ఎంతటి అనుభూతి గమ్యత ! అంతకన్న కావలసిన దేమున్నది!! సత్యానుభూతికి తనలో చోటిచ్చిన వాడు మాత్రమే అనగలిగిన మాట ... వేరొండుకు సాధ్యమా...!!!

ఆ అనుభూతి ఎంత మధురం ...! అది మధురాక్షరం ...!!

ఆ అద్వైతమూర్తి 'కబీరు' ఆలోచనామృతాన్ని తెలుగు వారలకు పరిచయం చేయాలన్న చిఋప్రయాస ఈ అనుసృజనం.

***"గంగ చెంతకు ... కుండతో వెళితే కుండెడు గంగ ...!***
***గరిటెతో వెళితే గరిటెడు గంగ ...!!"***

నా తెలివిడి బహుపరిమితము...! ఆతడా బ్రహ్మజ్ఞాని...!! ఈ ప్రయాస నావంటి దానకు అలవిమాలినదే...!! విజ్ఞులు ఉపేక్షించెదరు గాక !

ఈ బాధ్యతను మొదటగా నా కప్పగించిన వారు సాయిబంధువులు **శ్రీ సుధాకర్ గారు** (అధ్యాపకులు టి.ఆర్.ఆర్. కాలేజి, కందుకూరు). తదనంతరం నే చేసిన ఈ అల్ప ప్రయత్నానికి తమ **"ఆత్మజ్యోతి"** మాసపత్రికలో చోటిచ్చి, ఊతమిచ్చి, ఆ పై ఒక పుస్తకరూపమిచ్చి ... కడు వ్యయ ప్రయాసలను కడు ఓరిమితో వహించి, నా అలసత్వాన్ని ఎంతో సంయమనముతో సహించిన భాతృతుల్యులు **శ్రీ రావి మోహనరావు** (భూవిజ్ఞాన శాస్త్రోపన్యాసకులు) గారికి కృతజ్ఞతాంజలులు ...!! సహృదయ సంస్కారంతో ఈ గ్రంథ ప్రచురణకు ఆశీస్సులందించిన శ్రీ సదాశివబ్రహ్మేంద్రాశ్రమ పీఠాధిపతులు, **శ్రీశ్రీశ్రీ స్వామి అరుళానంద సరస్వతి వారికి నమస్సుమాంజలులు.**

తన శారీరక స్థితి సహకరించకున్ననూ లెక్కసేయక, ప్రయాసకోర్చి 20 పైబడి పుస్తకముల శోధించి, కబీరు సంప్రదాయాన్నీ కడు విపులంగా తమ 'పరితోషం' ద్వారా పరిచయం చేసి, నన్నాశీర్వదించిన **శ్రీ కోడూరి పుల్లారెడ్డి గారికి** సర్వదా కృతజ్ఞురాలను.

**సర్వే జనాస్సుఖినో భవన్తు.** 



**కోడూరు పుల్లారెడ్డి,** ***B.A., B.E, M.I.E.***
రాష్ట్రభాషాప్రవీణ్
S.E. (Elec.) Retd.,
Plot No.52, # 104, Rishi Residency,
Kalyan Nagar - III, HYDERABAD - 18
Ph: 040-40102376,
Mobile : 9885773145

# పరితోషం

మధ్యయుగ హిందీ నిర్గుణ కావ్యధారాప్రవర్తకుడు, సూఫీకవి, సంత్ (మహాత్మ) 'కబీర్‌దాస్' జీవనవృత్తం వైవిధ్యభరితం, ఒక ప్రభంజనం. కాశీలో స్వామి రామానంద్‌కు ఒక బ్రాహ్మణభక్తుడుండేవాడు. ఆ బ్రాహ్మణుని విధవ కూతురుకు స్వామివారు పొరబాటున 'సంతానవతివి అవుతావు!' అని ఆశీర్వదించాడు. ఫలితంగా ఆమెకు పుత్రోదయమయ్యింది. లోకనిందా భయంతో ఆమె ఆ బాలుని కాశీలోని 'లహర్‌తారా' అనే చెఱువు గట్టున వదిలి వచ్చింది. అలీ (నీరూ) అనే నిస్సంతు ముస్లిం సాలెవాడు (జులాహా) ఆ శిశువును తెచ్చుకొని పెంచాడు. ఆయన నాథ్‌పంత్ సంప్రదాయకుడు. అతని భార్యపేరు 'నీమా'. ఆ పసికందే "కబీర్‌దాస్" గా ప్రసిద్ధి చెందాడు.

కబీర్ జనన మరణ కాలాల గురించి ఎన్నో వివాదాలున్నాయి. కాని ఆయన ప్రధాన శిష్యుడు 'ధర్మదాస్' రచించిన రెండు పదాల ఆధారంగా ఆయన విక్రమ సంవత్ 1456 (క్రీ.శ.1399) లో కాశీలో జన్మించి విక్రమ సంవత్ 1575 (క్రీ.శ. 1518) లో 'మగహర్' లో దివంగతులైనారని పండితులు, చరిత్రకారులు నిర్ధారించారు.

ఆనాటి సామాజిక వ్యవస్థలో స్వామి రామానంద్ భక్తి బోధనల ప్రభావం చాల ఎక్కువగా ఉండేది. బాల్యావస్థలో ఉన్న కబీర్‌పై ఆయన ప్రభావం పడడం ఆశ్చర్యమేమీ కాదు. ఒకరోజు ఉదయం రామానందులవారు ఒక జాము ప్రొద్దుండగానే స్నానానికి బయలుదేరి చీకటిలో నదీతీరంలో ఉన్న కబీర్‌పై పాదం మోపాడు. రామానంద్ తక్షణం తనను తాను సంభాళించుకొని 'రామ్-రామ్' అన్నాడు. కబీర్ దాన్నే గురుమంత్రం అని భావించి ఆ తర్వాత రామానందుల శిష్యుణ్ణి కూడా చెప్పుకున్నాడు. కబీర్ అనుసరించిన పథంలో ముసల్మానులు కూడా ఉన్నారు. ప్రసిద్ధ సూఫీ ముస్లిం 'ఫకీర్ శేఖ్ తకీ' దగ్గర కబీర్ దీక్ష తీసుకున్నాడని ముస్లిములందరూ ఆయనకు గురువు ఆ ముస్లిమే అనేవారు.



రామానందుల పేరు ప్రఖ్యాతులు మారుమ్రోగుతున్న రోజులవి. కబీర్ క్రమం తప్పకుండా ఆయన 'సత్సంగ్' లో పాల్గొనేవాడు. కాలక్రమేణా రామానందుల భక్తిమార్గం క్రొత్తపుంతలు త్రొక్కింది. అందులో జాతి, మత, కుల భేదాలుండేవి కావు. ప్రత్యేక ఆహార నియమాలు కూడా లేవు. కబీర్‌కు ఈ వాతావరణం నచ్చినందువల్ల దాన్ననుసరించడంవల్ల రామానందులవల్లే 'రామనామస్మరణ' లభించింది. కానీ ఆ రామనామం కబీర్‌ను వైష్ణవ సంప్రదాయపు లోతుల్లోకి తీసికెళ్ళలేకపోయింది. ఆయన దేశాటనం విరివిగా చేసినవాడు. హఠయోగులు (తాము చెప్పిందే వేదవాక్కు అనేవారు), ముసల్మాన్ ఫకీర్లతో కూడ సత్సంగం చేశాడు. ఫలితం - ఆయన ప్రవృత్తి నిర్గుణోపాసనవైపు మళ్ళింది. అద్వైతవాద స్థూల రూప పరిజ్ఞానం ఆయనకు రామానందుల సత్సంగాలలో పాల్గొనకముందే అలవడింది. కబీరు రాముడు ధనుర్ధారి రాముడు కాక నిర్గుణ 'బ్రహ్మ' అయ్యాడు.

కబీర్‌కు చదువురాదు. ఆయనే స్వయంగా చెప్పుకున్నాడిలా --

मसि कागद छूयो नहीं, कलम गहीं न हाथ ।
चारिउ जुग को महातम, मुखहि जवाई बात ॥

(సిరా, కాగితము తగలలేదు, కలం చేతపట్టలేదు - మహాత్ములు ముఖతః విన్నదే నేను తెలుసుకొన్నది)

పుస్తక జ్ఞానం ఆత్మజ్ఞానార్జనకు అవసరం లేదు. తన జీవితకాలంలో తనకు లభించిన ఆత్మజ్ఞానమంతా సజ్జన సాంగత్యంవల్లనే సమకూరింది.

ఆవశ్యతానుగుణంగా కబీర్‌చేసే ప్రసంగాలను ఎంతో మంది శ్రోతలు వ్రాసుకునేవారు. ఆ లిఖిత పత్రాలే కబీర్ దివ్యవాణిని బహుముఖంగా వినిపించాయి. లిఖిత పత్రాల నుండి సేకరించినందువల్ల ఆయన సాహిత్యంలో పాఠభేదాలు బహుళంగా ఉంటాయి. ఆయన పేరుప్రఖ్యాతలు పొందిన తర్వాత ప్రక్షిప్తాలు అనేకం చోటుచేసుకొని వుండవచ్చు.

కబీర్ పరివారం చాలా చిన్నది. ఆయనతో తల్లిదండ్రులు, భార్య లోయా, కుమారుడు కమాల్, కుమార్తె కమాలీ ఉండేవారు. కబీర్ చాలా పేదవాడు. బట్టలు నేయడం వృత్తి. సాధుసంతుల వెంబడి తిరిగేదానివల్ల పూర్తి సమయం వృత్తికి కేటాయించ లేకపోయేవాడు. అయినా ఆయన నిత్యసంతోషి. తనకున్న దానితోనే సంతృప్తజీవనం గడిపిన వాడు కబీర్. సంపాదన గురించి కబీర్ యిలా అంటాడు -

साई इतनो दीजियो, जामें कुटुम समाय ।
मैं भी सूखा न रहूँ, साधु भूखा न जाय ॥

(స్వామీ! మా కడుపులు ఎండకుండ, సాధుసంతులకు ఆకలి లేకుండా ఉండేటంత మాత్రం దయచేయండి చాలు!)

నిర్భీకత, సత్యవాక్పరిపాలన కబీర్ మూలతత్త్వం. ఆయన పూర్తి క్రాంతికారి. కురీతులను, కుసంస్కారాలను చెంతకు చేరనిచ్చేవాడు కాదు. మాయామోహాలను జయించిన వారే ఆయనకు మిత్రులు. ఈ సందర్భంలో ప్రముఖ హిందీ రచయిత హజారీ ప్రసాద్ ద్వివేది కబీర్ మనస్తత్వాన్ని చిత్రించినవైనం గమనార్హం –

ఆయన తలనుండి పాదం వరకు ఈశ్వరునిలో లగ్నమైనవాడు. తన లక్ష్యాన్ని కష్టతమమైనా దృఢంగ ఆచరిస్తాడు. వజ్రసంకల్పుడు, నియమపాలకుడు, శిరీషపుష్ప సదృశకోమలహృదయుడు.

కబీర్ నిర్గుణసంత్. సమాజాన్ని శుద్ధిచేయడం, ధార్మికభక్తుడుగా అందరికీ అందుబాటులో వుండడం ఆయన వ్యక్తిత్వానికి నిలువుటద్దం. హిందూ ముస్లింలలో తనకు నచ్చని భావాలు, పద్ధతులు వుంటే నిర్భయంగా ఎత్తిచూపేవాడు. రూఢివాదం (పరంపరంగా వస్తున్న ఆచారాలను అంధవిశ్వాసంతో ఆచరించడం), పిడివాదం (తాను పట్టినకుందేటికి మూడే కాళ్ళనడం), ఉదారలేమిని ఆయన తనశక్తి కొద్దీ విరోధించాడు.

మోసపూరితులైన ముస్లింలను వ్యతిరేకిస్తూ 'జిహాద్' (ముస్లింల మత యుద్ధం)ను కబీర్ తన కవితలో ఉల్లేఖించాడు. ఆయనొక యుగప్రవర్తకసంత్. తాను చెప్పే సిద్ధాంతాలను, విశ్వాసాలను ప్రచారం చేయడానికి పెట్టుబడి ఆయన నమ్మకమే! అందుకనే కబీర్ గీతాలు అంత తీక్షణంగా ఉంటాయి. మానవులంతా సమానమని, సమాజంలో హెచ్చుతగ్గులు, అస్పృశ్యత, వంచన – ఇవన్నీ సమాజ వ్యవస్థకు సిగ్గుచేటని తన గీతాల్లో బహుళ ప్రచారం చేసిన కబీర్‌కు సూఫీసంత్ సాహిత్యంలో పెద్దపీట వేశారు. పై వాటిని ధిక్కరించే ఏ పండితులనైనా, ముల్లాలనైనా, సాధుసంతులనైనా సరే క్షమించలేదాయన.

కబీర్ మూలతః నిర్గుణభక్తిపరంపరలో పయనించిన జ్ఞానమార్గి. స్వామి రామానంద్ దగ్గర దీక్ష పొందినందువల్ల ఆయన భక్తి భావన భారతీయ భక్తిభావంతో నిండుకున్నా ఆయన మీద ముస్లింల ఏకేశ్వరోపాసన ప్రభావం కూడా ఉంది. ఇందుకు మూలకారణం – జాతి వివక్షకు వ్యతిరేకంగా జాతిని సమన్వయం చేయడానికి ఆయన మ్రోగించిన రణభేరి. హిందు, ముస్లింల మధ్య భేదభావం నిర్మూలించి సయోధ్య కలిగించడానికి నిరంతర కఠిన శ్రమ చేశాడు. పాఖండులన్నా (మోసగాళ్ళు), మూర్తిపూజ చేసేవారన్నా, రూఢివాదులన్నా ఆయనకు పరమ అసహ్యం.

కబీర్– ఈశ్వర్, అల్లా యిద్దరూ ఒకటేనంటూ ఇస్లాంఖుదా, అల్లాను ఈశ్వర రూపంగా భావించాడు. హిందువుల భగవంతుని నిరాకారుడైన సర్వవ్యాపిగ, సర్వసత్తాక నియంతగ, నియామకునిగ మన్నిస్తాడు. ముస్లింల ఏకేశ్వరోపాసనను సామాజిక నీతికోసం ఒక ఈశ్వర వాది రూపంలో హిందూ ముస్లింల ఏకత్వసాధనకు నిర్గుణ ఈశ్వరభక్తే ప్రశస్తమని బోధించాడు.



కబీర్ భక్తిభావంలో నిమగ్నుడైనా స్త్రీ పురుషుల సమాగమంలోని సుఖసంతోషాలను, విరహంలోని దుఃఖం, అశాంతిని అభివ్యక్తం చేసిన విశేషాలు వుండడం విశేషం. కవి తనను విరహిణిగా భావించి అత్యంత వ్యథితాత్మలోని మధురభక్తిని ఆత్మీయంగా వర్ణించిన తీరు ఆహ్వానించదగింది. ఆయన దృష్టిలో నామస్మరణే బ్రహ్మ. దోషాలకు, పాపాలకు, చెడుకు దూరంగా ఉండి ఈ నామస్మరణ సాధన చేస్తేనే ఫలితముంటుందంటాడు –

माला तो कर में फिरै - जीभी फिरै मुख माँहि ।
मनुआ दस दिसि फिरै - सो तो सुमिरण नाहि ॥

(జపమాల చేతిలో తిరుగుతూ ఉంటుంది. నాలుక కూడా భగవన్నామస్మరణ చేస్తూ వుంటుంది. కాని మనస్సు మాత్రం దశదిశల సంచరిస్తూ వుంటుంది. దీనివల్ల లాభమేముంటుంది?)

కబీర్‌కు భక్తి పాఠం గురుముఖతః ప్రాప్తించింది. ఆ అనుభవంతో "గురువు ఉచ్ఛకోటికి చెందినవాడైతే జ్ఞానభాండాగారానికి నెలవవుతాడు. శిష్యుని కప్పుడు సన్మార్గంలో నడవడానికి గురువు చక్కని ప్రేరణ యివ్వగలడు, మోహంలో చిక్కుకున్న జీవాత్మను ఉద్ధరించగలడు" – అని అంటాడాయన.

భక్తి సాధన కోసం ఏ విధమైన వైరాగ్యం లేకుండా మంచి గృహస్థుని జీవితం గడుపుతూ ఈశ్వర భక్తికి యోగ్యత పొందవచ్చు నంటాడు కబీర్. భక్తి సాధనకు ఆచరణలో కావలసిన శౌచ్యం లోపించి నప్పటికీ మనశ్శుద్ధితో ఈశ్వరోపాసన చేస్తే సత్ఫలితం లభిస్తుం దంటాడు. సుగుణాలను ఆచరించే సంకల్పం, ప్రతికూలగుణాలను పరిత్యజించడం, నిరాకారబ్రహ్మ ద్వారా రక్షణ లభిస్తుందన్న విశ్వాసం, రక్షకుని గుణగానం చేయడం, ఆత్మ సమర్పణం, రాక్షసప్రవృత్తిని వర్జించడం – ఇవి కబీర్ భక్తి సాధనలో ఆచరించిన విధానాలు. ఈ వాతావరణంలో భక్తి భావన సఫలత చెందుతుందంటాడు కబీర్.

కబీర్ భక్తి తరంగాలలో 'ఇడ, పింగళ, సుషుమ్నా, కుండలిని' మొదలైన వాటి వర్ణన ఉంది. గర్వాంధకారులను, సామాజిక కురీతులను, (భ్రష్ట) యోగులను విమర్శించాల్సిన అవసరం వచ్చినప్పుడు అఖండప్రజ్ఞతో, నిపుణతతో బుద్ధి చెబుతాడు ఆయన. యోగులకు చీవాట్లు వేయాల్సి వచ్చినప్పుడు వారి భాషలోనే ఈ విధంగా జవాబిస్తాడు కబీర్ –

[1]इंगला बिनसै [2]पिंगला बिनसै - बिनसै [3]सुषमनि नाडि ।
जब उनमनि तारी टूटे - तब कहं रही तुम्हारी ॥

1. इंगला –శరీర నాడీమండలంలో 'ఇడ' అనే పేరుగల ఒక నాడి.
2. पिंगला –హఠయోగంలో నాడీమండలంలో ప్రకంపించే 3 నాడుల్లో ఒక నాడి.
3. सुषम्ना –హఠయోగం ప్రకారం శరీర నాడీమండలంలోని మూడు ముఖ్యమైన

నాడుల్లో ఇది నాసిక నుండి బ్రహ్మరంధ్రం* వరకు వెళ్ళి వుంటుందనుకొనే నాడి.

**బ్రహ్మరంధ్రం** – పుర్రె మధ్యభాగంలో వుండే గుప్తరంధ్రం. ఈ రంధ్రం నుండి వెలికిపోతే బ్రహ్మలోకప్రాప్తి కలుగుతుందని ప్రతీతి.

(మనిషి శరీరంలో ఇడ, పింగళ, సుషుమ్న ప్రధాన నాడులు. ఇవి నీలో లోపించినప్పుడు నీ యోగసమాధి తత్త్వం నీ నుండి దూరమైపోతుంది. అప్పుడు నీ స్థానమెక్కడ?)

కబీర్ తన రచనల్లో హఠయోగానికి, ప్రేమ–భక్తికి ఒక సుందర సమన్వయం సంతరించాడు. ఆయనలో నిష్కామసేవాభావం ప్రబలంగా ఉంది, నిర్గుణబ్రహ్మపట్ల దృఢమైన శ్రద్ధ ఉంది. భక్తిసాధనలో బాహ్యసాధనాలను వర్జించి, అంతరసాధన వ్యావృత్తితో మనసులోనే పూజించమని ప్రవచించాడు. సర్వమతసమభావం ఆయన రచనల్లో సర్వత్రా గోచరిస్తుంది. ఆయన ప్రార్థించే ఈశ్వరుడు మందిర్, మస్జిద్‌లలో లేడు– కాబా, కాశీలలో లేడు – ఆయన అంతఃకరణంలో ప్రకాశిస్తున్న సర్వవ్యాపి. ఆయన సామీప్యం పొందడానికి తీర్థయాత్రలు చేయవలసిన అవసరం లేదు. రోజా నమాజ్ చేయవలసిన పని లేదు. హజ్ యాత్రల అవసరం లేదు. ఆయన వ్యక్తిగత పవిత్రతకు, సత్యాచరణకు మహత్వపూర్ణ స్థానమిస్తూ కూడా తన సాధనారీతిలో సమాజాన్ని ఉపేక్షచేయ లేదు. సమాజానికి దూరంగా ఉంటూ జపతపాలు చేస్తూ వుంటే శ్రేయస్కరం అనడు. మానవజాతి మనుగడపై అనంత ప్రేమభావనతో ఏ విధమైన వైరం, స్వార్థం లేకుండా కబీర్ ఎలా ప్రబోధిస్తున్నాడో గమనించండి –

कबिरा खडा बजार - सब की माँग खैर ।
न का उसे दोस्ति - न का उसे बैर ॥

(కబీర్ బాహ్య ప్రపంచంలో నిలబడి అందరికి శుభం కలగాలని ప్రార్థిస్తూ తనకు ఎవరితోనూ స్నేహమూ లేదు, వైరమూ లేదు – అంటున్నాడు.)

కబీరు బాహ్యాడంబరాలు వర్జించి కామం, క్రోధం, లోభం, మదం మొదలైన అరిషడ్వర్గాలను నియంత్రించడానికి వ్యక్తిగత శుద్ధత ఆధారమన్నాడు. ఆయన హిందూ, ముస్లింల బంధుత్వం కొరకు సరియైన సందేశమిచ్చి భారతదేశంలో సాంస్కృతిక విప్లవానికి చక్కని బాటవేశాడు.

కబీర్ భక్తుడు – దార్శనికుడు కాడు. బ్రహ్మ, జీవాత్మ, మాయలకు సంబంధించిన సిద్ధాంతాలను దార్శనికత అంటారు. బ్రహ్మను సర్వశక్తిసంపన్నుడన్నాడు ఆయన. కబీర్ నిర్గుణ భావుకుడైనా కూడా సగుణుడు, సకల సద్గుణ సంపన్నుడు. ఆయన 'శ్రీరాముడు– *సాకారరూపుడు, దీనబంధువు, సమర్థుడు, శరణన్నవానికి అభయప్రదానం చేసే ధీశాలి,*



సర్వవ్యాపి, అంతర్యామి, సర్వశక్తివంతుడు' అంటాడు. ఈ విధంగా ఆయన తన హృదయంలో సగుణరూపి అయిన రాముణ్ణి కూడా స్మరిస్తాడు. అయినా ఆయన రాముడు నిర్గుణుడు, నిరాకారుడు. ఆయనే ఈ విషయం సుస్పష్టంగా చెప్పాడిలా –

कोई ध्यावै निराकार को - कोई ध्यावै साकारा ।
वह तो इन दोऊ ते न्यारा - जाने जानन हारा ॥

सर्गुण की सेवा करौ - निर्गुण का करू ज्ञान ।
निर्गुण सर्गुण के परे - तहैं हमारा ध्यान ॥

(కొందరు నిరాకారుడైన బ్రహ్మను, మరికొందరు సాకారుడైన రాముని ధ్యానిస్తారు. తెలివిగలవారు వారిద్దరితో విలక్షణమైంది అని తెలుసుకుంటారు. సద్గుణ రాముని సేవించు, నిర్గుణ బ్రహ్మనుంచి జ్ఞానాన్ని పొందు. సగుణ నిర్గుణాలకతీతుడాతడు ... అతనియందే నా ధ్యాస ...!

కబీర్ బ్రహ్మ, జీవాత్మల ఏకత్వాన్ని అంగీకరించాడు. జీవాత్మ బ్రహ్మ అంశమే! జీవుడు మృతి చెందిన తర్వాత బ్రహ్మలో ఐక్యమై పోతాడు. బ్రహ్మ – జీవాత్మల కలయికతో మాయామయ బాహ్యావరణం వ్యథాభరితమవుతుంది. సద్గురువు సాధకునికి ఎప్పుడైతే మార్గం చూపిస్తాడో ఆ తక్షణమే 'మాయ' మాయమవుతుంది. ఈ కారణంగా కబీర్ తన భక్తి సాధనలో గురువులకు అత్యంత మహత్వపూర్ణస్థానం కలుగజేశాడు. జీవాత్మ బ్రహ్మలో ఐక్యమయ్యేందుకు గురువు ముఖ్యసాధనం కాబట్టి గురువును బ్రహ్మ కంటే గొప్పవాడన్నాడు కబీర్. కబీరు సద్గురువు మాహాత్మ్యాన్నిలా వివరిస్తున్నాడు –

पीछै लागा जाइ था - लोक वेद के साथि ।
आगौं ये सत गुरु मिल्या - दीपक दिया हाथि ॥

(నేను శాస్త్రానికి, లోకాచారాలకు అనుగుణంగా నడుచుకున్నాను. అయినా నాకు ముక్తి లభించలేదు. నిత్యం జనన మరణ చక్రంలోనే భ్రమిస్తున్నాను. సద్గువురు నాపై దయతో జ్ఞానదీపం నా చేతిలో భద్రంగా పెట్టాడు. అంతే–అంతరాంతరాల్లోని అజ్ఞానాంధకారం పటాపంచలైపోయింది.)

జీవాత్మ కెప్పుడూ బ్రహ్మైక్యత పొందడమే అంతిమ కోరిక. అతని సంపూర్ణ జీవితకాలం పుట్టింటి నివాసంలాకాక విరహకాలంలా వుంటుంది. ఇందుకే కబీరు కావ్యంలో విరహవేదనా వ్యాకులత దృగ్గోచరమవుతుంది. మృత్యువు తర్వాత జీవాత్మ బ్రహ్మాత్మలో ఐక్యమవుతుందని ముందు చెప్పుకున్నాం. బ్రహ్మతోపాటు జీవాత్మకు సంబంధించిన ధ్యానం. దాని ప్రేమభక్తినే రహస్యవాదమంటారు. సృష్టి అంతటా బ్రహ్మ వ్యాపించి ఉన్నాడు.

బ్రహ్మలేని పదార్థమేదీలేదు. కబీరు 'భావాత్మక రహస్యవాదం'లో మూడు పార్శ్వాలున్నాయి – అనురాగోదయం, ప్రేమపాత్రులతో పరిచయం, సత్సంగం. వీటి వివరణ ఈ వ్యాస పరిధిలోకి తీసుకురావడం కష్టం.

కబీర్ కాలంలో హిందు, ముస్లింలు తమ తమ మత విశ్వాసాలకు బలైనారు. ఈ మతాల ధర్మరక్షకులు అమాయకప్రజలను మోహపరచి,అనేక పాఖండులను, అంధవిశ్వాసు లను, విద్యాడంబరులను తమ వలలో వేసుకున్నారు. సమాజసంతులనం ఒరిగిపోయింది. ధార్మిక అవ్యవస్థ పెచ్చుపెరిగిపోయింది. హిందూజాతి పూజాపాఠం, కర్మకాండలను గురించి చెప్పుకోవడమేగాని దీని వెనుకనున్న నిజతత్త్వం మాయమైంది. ఇందులో కూడ వాస్తవ తత్త్వజ్ఞానుల బదులు అశిక్షిత ధర్మపరుల ప్రవేశం ఎక్కువయ్యింది. కబీరు వీరి లోగుట్టు విప్పుతూ, వారి నీచ ప్రవృత్తులను వింగడిస్తూ వీరు ప్రజలకు మహా శత్రువులని చాటి చెప్పాడు –

पाथर पूजे हरि मिलै - तो मैं पूजा पहार ।
बाते तो चाकी भली - पिसा खाय सन्सार ॥

(రాతిని పూజించడంవల్ల హరి లభిస్తే నేను అంతకంటే ఎత్తైన దాన్ని – పర్వతాన్ని పూజిస్తాను. నీవు మ్రొక్కే ఆ ఊయికన్న తిరుగలి గొప్పది. ఎందుకంటే రొట్టె పిండి విసరటానికి సాధనంగా అయిని పనికివస్తుంది.)

ఇదే విధంగా ముస్లింల ధార్మిక ఆడంబరాలను ఖండిస్తూ కబీర్ అంటాడిలా–

कांकर पाथर जोरी कै - मसजिद लई बनाय ।
तू ऊपर बांगदै - क्या बहरिरा खुदाय ॥

(రాళ్ళు, రప్పలతో మసీదు నిర్మించావు – బాగుంది! కాని పైకెక్కి 'అల్లాహో అక్బర్' అని ఆకాశం చిల్లులు పడేటట్లు కేకలేస్తే ఆ అల్లా పలకడెందుకు? ఆయనేమైనా చెవిటి వాడా?)

ఈ నేపథ్యంలో అలోచిస్తే కబీర్ కేవలం కఠినమైన ఆలోచనాపరుడే కాక నిజమైన సంఘసంస్కర్తగా కనిపిస్తాడు. ఆయన ఆలోచనల్లో సమదృష్టి వుంది. రెండు మతాల వారిని చెడునడతల నుండి సరైన దారిలోకి తీసుకురావడానికి జీవితాంతం ప్రయత్నం చేశాడు. శూన్యత అనే శయ్యపై వ్యాపించిన వారి వైషమ్యాన్ని నిరోధించడానికి తన భక్తిధారతో నిరంతర ప్రచారం చేశాడు. పరోపకారసేవ, క్షమ, దాతృత్వం, ధైర్యం, అహింస మొదలైన వాటిని జీవన స్రవంతిలోకి తీసుకొనిపోయి, సాత్త్వికదృష్టితో సక్రమంగా ఆచరించమని ఉద్బోధించాడు. మిథ్యాడంబరులను, పాఖండులను విరోధించి ఆంతరిక



సాధన, అంతఃకరణ శుద్ధి మాహాత్మ్యాన్ని ప్రతిపాదించాడు. పశువధ, గోవధలను విరోధించి జనసామాన్యంలో అహింస, సంయమనం ప్రబోధించాడు. ధర్మం ఈశ్వరుని ఏకత్వం ప్రతిపాదించి ఆనాటి హిందూ ముస్లిం ఐక్యత స్థాపించటంలో ఆయన కృషి చాలావరకు సఫలీకృతమైంది. నిర్గుణుడు, నిరాకారుడు అయిన బ్రహ్మోపాసనా ప్రచారం చేసి ప్రజల్లో ఉన్న కఠినత్వం, విషమపరిస్థితిని చాలవరకు దూరంచేసి మానవ హృదయాల్లో ఆధ్యాత్మికతకు బీజారోపణ చేశాడు.

ప్రజల హృదయాలకు సూటిగా తగిలే తన వాణి ద్వారా కబీర్ ఆ కాలపు ధార్మిక పాఖండులను, సామాజిక దుర్నీతులను దూరంచేసి సామాన్యజనానికి సరళజీవనం, సత్యాచరణం, సాత్విక ప్రవర్తన, పరస్పర ఏకత్వం, సమత్వం మొదలైనవాటివైపు వారి దృష్టిని మళ్ళింపజేసిన ఆయన ప్రణుతి పరిణామ స్వరూపంవల్ల ఆ కాలంలో ఉచ్చకోటి సమాజ సుధాకర భక్తకవి రూపంలో స్మరించబడ్డాడు. ఆయన ఒక కవి మాత్రమే కాదు– ఉన్నతశ్రేణి సామాజిక సాధకుడు కూడా. సత్యోపాసకుడైనందువల్ల పరమ పురుషుని దివ్యసందేశం సమాజానికి సమర్పించడానికి మాత్రమే ప్రవచించాడు. అది కాల ప్రవాహంలో కావ్యరూపం దాల్చింది. ఆయన దార్శనికుడు, సమాజ సుధారకుడు. ఆయన హృదయం లోకకళ్యానార్థం చలించింది.

కబీర్ చదువురాని భక్తకవి. అయినా ప్రపంచాన్ని సక్రమ దృష్టికోణంలో చాలమంది కంటే చక్కగా అర్థం చేసుకున్నవాడు. కాని ఆయన కావ్యం సూరదాస్ మొదలైన భక్తకవుల రచనల్లోని మధుర భక్తి భావాలకు ఏమాత్రం తీసిపోదు. తన రసరమ్య కావ్యంలోని ప్రియుల సరస సమాగత గీతాలు, సౌందర్యవర్ణన, అలౌకిక ప్రేమానుభూతి – ఇవన్నీ ఆయన జీర్ణించుకున్న జ్ఞానానుభూతుల సంతులిత సందేశమంటే ఉచితంగా వుంటుంది.

बिरहा बिरहा [1]जिनि कहौं - बिरहा है [2]सुलितान ।
[3]जिह घटि बिरह न संचरै - सौ [4]घट मसान ॥

1. మతి 2. సుల్తానా 3. ఏ శరీరమందు 4. ఘటము (శరీరానికి ప్రతీక)

(విరహాన్ని చెడ్డగా మాటాడవద్దు. విరహం అనేది చక్రవర్తి. ఏ శరీరంలోనైనా విరహం పొలకువ లేకుంటే అది శ్మశానంతో సమానం.)

విరహం లేకపోతే ప్రేయసీ ప్రియులు కలుసుకోలేరు. వాళ్ళను కలిపి శాంతిని చేకూర్చే దేవత విరహం అంటాడు కబీర్.

కబీర్ కావ్యం గంభీరమైన ఆత్మానుభూతితోపాటు సత్యాన్వేషణ, నిజనిర్ధారణా బాహుళ్యతతో నిండి ఉంటుంది. ఆయన తన కవితను తన గురువు గంభీరవాణిగా

గుర్తిస్తాడు. ఆయన సాహిత్య కావ్యకళకు ఉన్నత స్థానం లభించింది. జనజీవనంలో వ్యాపించిన పరస్పర వైషమ్యాలు దూరంచేసి సమానత, ఐక్యత స్థాపించి గొప్పగా కీర్తింపబడే కార్యం చేశాడు. ఆయన సాహిత్యంలో సమన్వయ వాదపు మెఱుపులు ఆణిముత్యాల్లా ప్రోదిచేసు కున్నాయి. వర్ణ, వర్గ, జాతి, మత, కులభేదాలు, అస్పృశ్యతా నివారణ మున్నగు వాటిని పరబ్రహ్మ ఆశీర్వాదంతో, అనిర్వచనీయశక్తియుక్తులతో సమాజమంతటా పరస్పర ఆత్మీయతను స్థాపించడానికి కృషిచేసినవాడు కబీర్.

కబీర్ హృదయంలో సత్యానుభూతికి ప్రాధాన్యత వుంది. దాన్ని దైనందిన ప్రతీకల ద్వారా వ్యక్తపరిచాడు కబీర్. ఉదాహరణకు: కడవ-నీరు, మగ్గం-పడుగు/పేక, చరఖా-నూలు; సామాన్య భౌతిక ప్రతీకలరూపంలో: చంద్రుడు-చాతకపక్షి, సింహం-ఆవు, పిల్లి-ఎలుక, కోడి-చీమ; పారివారిక పదాల ప్రతీకలరూపంలో: తల్లిదండ్రులు-పుత్రుడు, స్త్రీ-పతి; సామాజిక పదాల ప్రతీకల రూపంలో: స్వామి-సేవకుడు/బానిస, దుకాణం-కొనువాడు మొదలైనవి ప్రయోగపూర్వకంగా రచనచేశాడు. ఆయన తన లోతైన అనుభూతిని ఈ ప్రతీకల మాధ్యమంతో చాలా సహజపద్ధతిలో జీవత్వం ఉట్టిపడేలా చిత్రించాడు. ఆత్మను హంస, సతి, విరహిణి, సూదరి మొదలైన పదాలతో పలుకరించాడు. ఇడానాడిని గంగానది అనీ, పింగళనాడిని యమునానది అనీ, సుషమ్నానాడిని సరస్వతీ నది అనీ సంబోధించడం ఆయనకే చెల్లింది.

కబీర్ కావ్య నిర్మాణంలో అలంకార శాస్త్రాంశాలు ప్రయత్నపూర్వకంగా చేసినవి కావు. ఆయనకిది అనాయాసంగా లభించిన నిధి. ఉపమ, యమకం, శ్లేష, ఉత్ప్రేక్ష, వ్యతిరేక, విశేషోక్తి, అర్థాంతరన్యాసం వంటి అలంకారాలు ఆయన కావ్యంలో కనువిందు కలిగిస్తాయి. ఆయనకు అలంకార, ఛందశ్శాస్త్రాలంటే ఏమిటో తెలియదు. కావ్యంలో మాధుర్య, ప్రసాద గుణాలు నిండుగా లేవు. పద ప్రయోగంలో చతురత లేదు. భాషలో లింగం, వచనం, కారకాలు మొదలైన నియమపాలన లేదు. కావ్యాన్ని విభిన్న భాషలతో కూడిన 'కిచడీ' గా తయారుచేశాడు. ఇన్ని లోపాలతో కళాపక్షంగా శిథిలమనుకున్నా భావపక్షంగా కబీర్ కావ్యం ఎంతో పరిణతి చెందిన ఉత్కృష్ట గ్రంథంగా వినుతికెక్కడం విచిత్రం. ఆయన కావ్యకళామర్మజ్ఞుడు కానప్పటికీ, జనసామాన్యానికి అవసరమైన అపురూప సందేశమిచ్చిన శబ్దశిల్పి. సంగీతజ్ఞుడు కానప్పటికీ హిందీభాషకు లభించిన "దివ్య అలౌకిక గాయక సమ్రాట్టు".

కబీర్ ఎన్నిగీతాలు ప్రవచించాడో అంచనా వేయడం కష్టం.ఇందులో భేదాభిప్రాయా లున్నాయి. అవన్నీ దాదాపు 1350 వరకు ఉంటాయని సాహిత్యకారుల అంచనా. ఆ తర్వాత పండితులు వాటిని సాఖీ (700), శబద్ (500), రమైనీ (80) అని విభజించారు.



పై సంఖ్యపై ఏకాంగీకారం లేకపోయినా ఆయన సర్వతోముఖ మహనీయతకు అందరూ జోహార్లర్పించినవారే! ఈ పదాల గూర్చిన సంగ్రహ వ్యాఖ్య అవసరం -

**సాఖీ:-**'సాఖీ' అంటే సాక్షి అని అర్థం. దీన్నే 'దోహా' అని కూడా అంటారు. కబీర్ సాఖీలు ప్రసిద్ధం. ఆయన సాక్షాత్తు తాననుభవించిన జీవనప్రవృత్తిని సాఖీల ద్వారా ప్రజల ముందుంచాడు. ఇదొక విధమైన జ్ఞానచక్షువు. ఇవి మహాత్ముల ఉపదేశాలు, జ్ఞాన ధ్యాన విషయాలు, చిక్కులను అవలీలగా విప్పే జ్ఞానదిక్సూచికలు. సద్గురు కృపతోనే భక్తుడు సంసారబంధంనుండి విముక్తి చెంది పరమాత్మ చెంతకు చేరగలుగుతాడు. భగవన్నామస్మరణ తోనే ముక్తి మార్గంలో ముందుకు పోగలుగుతాడు. ఆయన సంస్మరణతోనే జ్ఞానప్రాప్తి లభిస్తుంది. అప్పుడే సాధకునికి ముక్తి అందుబాటులోకి వస్తుంది. మానవునికి సదాచారాలు శ్రద్ధాభక్తులతో ఆచరించడానికి శిక్షణ దొరుకుతుంది. భక్తిభావం, నైతికత, వ్యావహారిక దార్శనికత పరిపూర్ణంగా సాఖీలు బోధిస్తాయి.

**శబద్:-** 'శబద్' అంటే శబ్దము /పదము. సాఖీకి వ్రాసిన ముందుమాటే శబద్‌కు కూడా సరిపోతుంది. ఒక ఉదాహరణతో సరిపెట్టుకుందాం!

ता मन कौं खोजहु रे भाई - तन छूटे मन कहाँ समाई ।
सनक सनंदन जैदेव नामा - भगति करी मन उनहूँ न जानी ।
सिव विरिंचि नारद् मुनि ग्यनी - मन कर गति उनहूँ नहीं जानी ।
धू प्रहिलाद विभीषन सेषा - तन भीतर मन उनहूँ न देखा ।
ता मन का कोई जानै भेव - रंचक लीन भया सुषदेव ।
गोरख भर तरी गोपीचंदा ता मन सौं मिलि करे अनंदा ।
अकल निरंजन सकल सरीरा ता पन सौं मिलि रहो कबीरा ॥

(శరీరంలో ఉండి కూడా శరీరానికి ముక్తిని ప్రసాదించే మనస్సును వెదికి పట్టుకోవాలి. మృత్యువు తర్వాత కూడా ఆ మనస్సు నాశం కాదు. చింతాక్రాంతమైనా దానికి మరణం లేదు. సనకసనందనాదులు, జయదేవ్, నామ్‌దేవ్ మొదలుగాగల భక్తులు కూడా ఆ మనస్సును తెలుసుకోలేకపోయారు. శివుడు, బ్రహ్మ (కబీర్ తన కావ్యంలో చెప్పే బ్రహ్మ కాదు), నారదాది జ్ఞానులు కూడా ఆ మనస్సు పొలకువ కనిపెట్టలేకపోయారు. దాని ఉనికి కొంచెంగా తెలుసుకున్న ఘనత శుకమహర్షికి దక్కింది. గోరఖ్‌నాథ్, గోపీచంద్ మొదలైన యోగిపుంగవులు ఆ మనస్సులో విలీనమై ఆనందించారు. ఇంకా ఆనందిస్తూనే ఉన్నారు. అఖండము, అనంతమూ అయిన విషయవాంఛల తిమిరం నుండి ముక్తిపొందా లన్నదే కబీర్ ధ్యేయం. ఆయన ఆ ఆలోచనల్లో మమైకమైపోయాడు.)

**రమైనీ:–** 'రమైనీ' కబీర్ ప్రవచించిన ఇతర కవితలకు పూర్తిగా భిన్నమైనది కాదు. కవి తన వైవిధ్యభరితభాషాశైలిలో విషయ వస్తు ప్రయోగం చేస్తాడు. ఇది ఒకే రచయిత భావప్రకటనలు వివిధ లేఖకులవని భ్రమను కలిగిస్తుంది. కబీర్ సాఖీల, శబద్‌ల విభజన ఆయన శిష్యులు చేసి ఉంటారు. అప్పుడు 'రమైనీ' ని కూడా చేర్చి వారి సౌలభ్యం కోసం సాఖీలలో జీవుల, శబద్‌లలో బ్రహ్మ, రమైనీలలో ప్రాపంచికవిషయచర్చ చేర్చి వుంటారు. వస్తుతః జీవుల ప్రపంచం, బ్రహ్మచర్చ సంత్ కవులందరిదీను. రమైనీలో ఒకచోట స్పష్టంగా చెప్పాడు కబీర్ – పరమతత్త్వం (నిర్గుణబ్రహ్మ) చెప్పనలవికాదు. ఇది రాముని 'రమైనీ' కాదు – అంటే చరిత్రను గురించి చెప్పడం కాదని – కబీర్ అంటాడు.

जाकर नाम अकहु आरे भाइ - ताकर काह रमैनी गाई ।

ఇక్కడ రామ సంకేతం నిర్గుణ బ్రహ్మ. ఆయన ఉచ్చకోటి సాధకుడు. అన్ని రచనలు అన్ని పరమతత్త్వాలను సాక్షాత్కరించుకొన్న పరిణామం ఆయనలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. సాఖీ శబ్దం ఆధారంగా కనువిందు చేస్తుంది. అయితే సాఖీలు, పదాలు వివిధ సందర్భాల్లో కబీర్ చెప్పివుండవచ్చు. లభించిన కొద్ది వివరాల ఆధారంగా ఏ విషయమైనా ఇదమిత్థమని నిర్ణయించడం కష్టంతో కూడిన పని. కబీర్ పేరును ఉపయోగించుకొని ఎంతోమంది 'కబిరా', 'జోగడా' మొదలైన పదాలను ప్రచారం చేశారు. వాటి పుట్టుక 'కబీర్‌వాణి' తో జతచేయడం ఆశ్చర్యమేమీ కాదు. ఇవన్నీ ప్రామాణికాలు కావని నిర్ణయించి కబీర్ కవితా సంకలనకర్తలు చాలామంది వాటికి తమ సంకలనాల్లో స్థానం కల్పించలేదు.

'రమైనీ' గురించి విశ్వసనీయ అభిప్రాయ సేకరణ జరగనంతవరకు వీటన్నింటినీ సంత్ కబీర్ రచనలేనని అంగీకరించాలి. ఒక మహనీయుని వాణి అక్షరబద్ధం కాక ప్రజల నోళ్ళలో నానుచున్నప్పుడు అవి పాఠభేదాలు లేకుండా లభించవు. అన్నీ ప్రచారంలో ఉన్నప్పుడు అంతిమ నిర్ణయం ఎలా చేయాలి? సాధ్యపడదు. అందువల్ల అందుబాటులో ఉన్నదాన్ని అలాగే అంగీకరించడం ఉత్తమం. ఒక ఉదాహరణ గమనించండి –

कर पल्लौ के बल खेलै नारि - पंडित होय सो लेय बिधारि ।
कपडा न पहिरै रहै उधारि - निरजीव सो धन आति पियारि ।
उल्टी पल्टी बाजै तारी - काहू मारै काहू उचार ।
कह हिं कबीर दासन के दास - कहू सुखदे काहू निरास ॥

('మాయ' హస్తాలు చిగురుటాకుల్లాగా మృదువుగా వుంటాయి. అంటే 'కోమలత్వం' మాయకు మరోపేరు. సుతిమెత్తని స్పర్శతో అది తన 'మాయాజాలం' రచిస్తుంది. ఈ విషయాన్ని విద్వాంసులు మాత్రమే గ్రహించగలరు. మాయే స్వయంగా ఆచ్ఛాదనంలో వుంటుంది. కాబట్టి దానికి మరో ముసుగు అవసరంలేదు. నగ్నశరీరయై అజ్ఞానులను



ప్రేమిస్తుంది. జ్ఞానులు 'మాయ' నగ్నత్వ ప్రభావానికి లోబడరు. ఈ 'మాయ' సంసారమూ, దేహమూ అనే వాద్యాలను తలక్రిందులు చేసి మీటుతుంది, శరీరంలోని నరనరాల్లోకి ప్రాకి పోతుంది, అజ్ఞానులను అంతం చేస్తుంది. జ్ఞానులు మాత్రం 'మాయ' అనే దేహాన్నే ఆధారం చేసుకొని ముక్తిని పొందుతారు, భవబంధాలనుండి రక్షింపబడతారు. సంత్ కబీర్ యొక్క నిర్గుణబ్రహ్మ భక్తులకు దాసానుదాసుడు. ఈ ప్రభావంవల్ల ఆయనకు ముక్తి లభిస్తుంది, సుఖిస్తాడు. అజ్ఞానుల సంసారాన్ని మాత్రం నిరాశకు గురిచేస్తుందీ 'మాయ'.)

**కబీర్ వ్యతిరేక భావార్థపదప్రయోగం (ఉల్‌టా వాఁసియా):–**

లోకంలో భోగలాలసులు, అస్థిరులు తాము యితరులను భోగవస్తువులుగా వాడు కుంటున్నా మనుకుంటారు. పిండి చేయబడే గోధుమలతోబాటు తిరుగలి కూడా అరిగి పోతుందని వీరు గమనించలేకపోతున్నారు. భోగులందరికీ ఇది వర్తిస్తుంది. వారు గమనించ లేని విషయం మరొకటున్నది. తిరుగలి రెండు రాళ్ళను సంధించి పట్టుకోవడానికి క్రింది రాతి మధ్యలో లోహంతో చేయబడిన చిన్నపాటి లావు కడ్డీలాంటి సాధనముంటుంది. యోగి అయినవాడు దీన్ని యీ ప్రక్రియకు ముఖ్యసాధనమని గ్రహిస్తాడు. అదే లేకపోతే పిండికావడానికి తిరుగలి తిరుగలేదు. యోగి లోహస్తంభశక్తిని గుర్తించాడు. ఆయన మిగత వారికంటే భిన్నంగా ఆలోచిస్తాడని తెలుస్తున్నది. గోధుమలు, తిరుగలి, పిండి యివేవీ ఆయన దృష్టిలో ప్రాముఖ్యంలేనివి. మధ్యలోనున్న లోహపు కడ్డీయే సర్వస్వం అనుకుంటాడు. దాన్నే పరమాత్మగా భావిస్తాడు. ఆకాశం, భూమి – ఈ రెండూ తిరుగలి రాళ్ళ మధ్యలో వున్నాయంటాడు. ఆకాశం సూక్ష్మమైనది. యోగి ఆలోచన ఆకాశం కంటే యింకా సూక్ష్మ మైనది. ఆకాశం ప్రాణికోటిని సృష్టించిన మూలపదార్థం – పంచతత్త్వం (భూమి,జలం, వాయువు, అగ్ని, శూన్యం / ఆకాశం). వీటిని తెలుసుకోవడం కంటే తిరుగలిలోని లోహపు కడ్డీని గురించి తెలుసుకోవడమే కష్టమంటాడు యోగి అయినవాడు. ఎవరు చూడగలరిది? ఎవరికి ఈ అనుభూతి కలుగుతుంది? ఎవరైతే వ్యతిరేకంగా లేక తలక్రిందులుగా (ఉల్‌టా) చూస్తారో వారు మాత్రమే తెలుసుకోగలుగుతారు.

కబీర్ అంటాడు – సాధకుడు మెలకువగా వుండి తలక్రిందులుగా చూస్తాడు. అందరూ నవ్వినప్పుడు ఏడుస్తాడు. వాళ్ళు ఏడ్చినప్పుడు నవ్వుతాడు. నీళ్ళలో వున్న చేప తన దప్పికను తెలుసుకోగలిగితే అది యోగి అవుతుంది. యోగి సత్యదర్శనం చేయడానికి వాడే ఒరుపురాయి ప్రత్యేకమైనది. ఈ భావన ఆయనకు అర్థమైనా సరాసరి మామూలు మాటల్లో చెప్పలేదు. తలక్రిందుల భావనలు బోధించడం కష్టం కాబట్టి అది అర్థమయ్యేటట్లు చెప్పడానికి అవసరమైన భాష కూడ మామూలుగా వుండదు – తలక్రిందులుగా ఉంటుంది.

భగవద్గీతలోని ఒక శ్లోకంలో కూడా ఈ వ్యతిరేక పదాల ప్రయోగం గమనించండి–

***ఊర్ధ్వమూల మధః శాఖం – అశ్వత్థం ప్రాహురవ్యయమ్।***
***ఛందాంసి యస్య పర్ణాని – యస్తం వేద స వేదవిత్॥***

(సంసారమనే అశ్వత్థవృక్షం రేపటి వరకు కూడ నిలకడలేనిది. పైనున్న పరమాత్ముడే దీని అధిష్ఠానదాత. కాబట్టి ఇది నశించేది కాదు. దీని క్రిందికొమ్మలు అధోముఖాలైన జీవులు. కర్మకాండాత్మకాలైన వేదభాగాలే దీనిని పోషించే ఆకులు. దీన్ని అచ్చంగా ఎరిగిన వాడెవడో వాడే వేదవేత్త)

ఇక్కడ శ్రద్ధగా గమనించాల్సిన విషయం – చెట్టు వ్రేళ్ళుపైన, ఆకులు క్రింద ఉన్నాయని తలక్రిందుల భాష వాడకం. అంటే వ్రేళ్ళు నిరాకారుడైన బ్రహ్మలో ఐక్యమైనా యన్న భావన యోగిపుంగవుడైన శ్రీకృష్ణుడు ప్రోదిచేయడం. అలాగే వ్రేలాడే ఆకులే వేదాలనడం.

తలక్రిందుల భాషా ప్రయోగంవల్ల లాభమేమిటి? కబీరంటాడు – దీనివల్ల శత్రువు మిత్రుడవుతాడు – నాశనమయ్యేవాడు సనాతనుడవుతాడని. కబీర్ పై భావాన్ని తల క్రిందులుగా ఉండాలన్నది ఎలా చెబుతున్నాడో గమనించండి –

बैरी उलटि भये है मीता
साखत उलटि सुजन भये चीता ।
अब मन उलटि सनातन हुआ
तब जाना जब जीवन मूआ ॥

కబీర్ మనస్సు తలక్రిందులుగా ఆలోచిస్తుంది. కళ్ళలోపల వుండే ప్రభువును, ఆత్మలో వుండే ఈశ్వరుని గమనిస్తాడు. ఆత్మారాముడు తప్ప జగమంతా అబద్ధమంటాడు. ఆత్మ దర్శనం చేసుకోవడానికి ఆయన గుహలో కూర్చుంటే ప్రపంచమంతా గోచరిస్తుందట. బాహ్య ప్రకృతి యేదీ కనిపించదు – మిథ్య కాబట్టి బయటిదంతా నశ్వరమే!

बैठि गुफा में सब जग देखा ।
बाहर कभू न सूझै ॥ – అని అంటాడు కబీర్.

మరోచోట భూమి తిరగబడి ఆకాశాన్ని తగులుతుందంటాడు –

धरती उलटी आकासै जायी ।

భూమి ఇక్కడ మూలాధారచక్రం. యోగి ఈ చక్రబంధంనుండి లేచి తన ధ్యాన బ్రహ్మరంధ్రాన్ని ఆకాశంలో స్థాపిస్తాడు. యోగిజ్ఞానం సంసారిక జ్ఞానంతో పోల్చినప్పుడు తలక్రిందులుగా కనిపిస్తుంది.



వ్యతిరేక భావార్థ పదాల మాధ్యమంలో ప్రతీకాత్మతతో సంత్ కవులు సామాన్య పౌరులకు సులభంగా అర్థమయ్యే రచనలు చేశారు. వారిలో కబీర్ ఆద్యుడు. ఆయన ఈ పద్ధతిలో ఇహలోకానికి సంబంధమైన బహుముఖప్రక్రియలు,భ్రమ,ప్రాపంచిక వ్యవహారాలు, వ్యక్తిగత సమస్యల చర్చ, సమానాత్మక రహస్యవాదం, జ్ఞానం, విరహం, సహజమైన అనుభూతి, ఆధ్యాత్మిక జీవిత వర్ణన, ఆత్మజ్ఞానం, మాయ, కాలం సృష్టి, మనః స్వరూపం– వీటన్నిటిని గుర్తించి సామాన్య జనజీవనంలో పాతుకొని పోయేటంత సరళంగా బోధించాడు. పై వాటినన్నిటిని సోదాహరణంగా వివరించడానికి ఇది వేదికకాదు. కాని ఒకటి మాత్రం నేటికీ నిజం. ప్రతీకాత్మక మాధ్యమంలో బోధచేసి సమాజాన్ని మెప్పించిన మధ్యకాలీన సంత్ కవుల్లో కబీర్‌ను మించినవారు లేరు. ఈ ప్రయోగాలపై ప్రసిద్ధ సాహితీవేత్త డా॥ రామచంద్రశుక్ల్ ఇలా అంటాడు–'కబీర్‌కు చదువులేకపోయినా ఆయన ప్రతిభా సమన్వితుడు. తాను అనుకున్నది తీవ్రపదజాలంతో వ్యక్తపరుస్తాడు. ఆయన వాక్కు ప్రచండం, వ్యంగ్యం, చమత్కారపూర్ణం. ఆయన బోధించే ఉక్తులలో విరోధ, అసంభవ వైచిత్రి ఎంతో ఆకర్షిస్తుంది'.

**నాథ్ పంత్ సంప్రదాయం:–** 'నాథ్' లలో ప్రథముడు 'ఆది నాథుడు'. ఈ సంప్రదాయాన్ని పాటించే వారంతా ఆయనను పరమశివుని అవతారమంటారు. ఈ సంప్రదాయానికి మరెన్నో పేర్లున్నాయి. అన్నిటికీ ముఖ్యధర్మం యోగాభ్యాసం. ఈ సంప్రదాయాన్ని వివరించే గ్రంథాలను భక్తులందరు 'సిద్ధాంత గ్రంథ' మంటారు. ఆదిశంకరాచార్యులు కూడా చివర నాథ్ సంప్రదాయి అయి 'సిద్ధాంతబంధు' అనే గ్రంథం వ్రాశాడు. ఆయన ప్రచారం చేసిన మతాన్ని ప్రజలు 'అవధూతమతం' అని కూడా పిలిచేవారు.

'నా' అంటే అనాదిరూపం. 'థ' అంటే స్థాపించడం. 'నాథ్' యొక్క స్పష్టార్థం ముల్లోకాల స్థితి, లయలకు కారణమైన 'అనాదిధర్మం' అని. దీనికి మరెన్నో అర్థాలు, శాఖలు కూడా ఉన్నాయి. వాటిలో ప్రసిద్ధమైంది 'గోరఖ్‌నాథ్' శాఖ. నాథ్ సంప్రదాయ యోగులను సమాజంలో వారి ఆకారంవల్ల తేలికగా గుర్తించవచ్చు. 'మనుచరిత్ర' ప్రబంధంలో మునివర్ణనలో చెప్పినట్టు 'ముడిచిన ఒంటికెంజెడ', మాలిక్ మహమ్మద్, జయ్‌సీ, పద్మావత్ కావ్యంలో రత్నసింహుని మామ సన్యాసి వేషధారణ – 'చెవులకు కుండలాలు, మెడలో రుద్రాక్షమాల, చేతిలో జపమాల, శరీరమంతా భస్మం, చేతిలో కమండలం, కప్పెర, చంకలో పులితోలు, త్రిదండం, కాళ్ళకు పావుకోళ్ళు, నడుముకు గట్టి బిగింపు, కాషాయవర్ణం జీర్ణవస్త్రధారణ'తో 'గోరఖ్, గోరఖ్' అని జపిస్తూ తిరుగు తుంటారు వీరు.

నాథ్ సంప్రదాయికులు మొదట్లో రెండు చెవులకు మట్టి కుండలాలు ధరించేవారు. అవి అతి త్వరగా పగిలిపోతుండడంతో ఆ తర్వాత లోహకుండలాలు ధరించేవారు. ఈ ఆచారం ఎప్పటి నుండి, ఏ యోగివల్ల ఆచరణలోకి వచ్చిందో ఇదమిత్థంగా చెప్పడానికి వీలుకాదు. కొంతమంది ఆదినాథుని శిష్యుడైన మత్స్యేంద్రనాథుడే ఈ నియమబద్ధం చేశాడంటారు. గృహస్థులు, స్త్రీలు, విధవలు కూడా కుండలాలు ధరించి ఈ సంప్రదాయం పాటించవచ్చు. గోరఖ్ పంత్ మార్గం ఆచరించేవారు మంచిరోజు చూసుకొని, చెవులు పొడిపించుకొని కుండలాల ముద్రాంకితం చేయించుకొనేవారు. ఈనాడు మనం చూసే కబీర్ ప్రతి చిత్రంలోనూ ఆయన చెవులకు కుండలాలుంటాయి. ఆయన 'నాథ్' సంప్రదాయకుడు అనేదానికి ఇంతకంటే నిదర్శనమేంకావాలి?

నాథ్ సంప్రదాయాన్ని ఆచరించే వారిలో ముస్లిం గృహస్థులు కూడా అధిక సంఖ్యలో వుండేవారు. ముస్లింలు మన దేశంలో స్థిరపడిన నేపథ్యం క్లుప్తంగా వివరిస్తాను –

క్రీ.శ. 570 లో మహమ్మద్ ప్రవక్త మక్కాలో జన్మించే నాటికి ప్రబలమైన రాజ్యాలు రెండున్నాయి. పశ్చిమాన రోమన్ సామ్రాజ్యం, తూర్పున పర్షియా సామ్రాజ్యం. ఈ రెండు సామ్రాజ్యాల మధ్యన గల చిన్న చిన్న దేశాలు ఇరు రాజ్యాల దాడికి మెండుగా గురి అవుతుండేవి. బలవంతపు శిస్తు రెండు రాజ్యాలవారికి చెల్లిస్తుండేవారు. క్రీ.శ. 632 లో మహమ్మద్ ప్రవక్త నిర్యాణం చెందే నాటికి అరేబియా ద్వీపకల్పం మాత్రమే ముస్లింల చేతికొచ్చింది. ఆయన నిర్యాణం తర్వాత ఖలీఫాల పేరుతో ముస్లిం రాజ్యపాలన జరిగింది. మొదటి నాలుగు మంది ఖలీఫాల 20 సంవత్సరాల రాజ్యపాలనలో రెండు అగ్రరాజ్యాల మధ్యనున్న చిన్న దేశాలనన్నిటినీ జయించి రాజ్యాన్ని విస్తృతపరచడం జరిగింది. తర్వాత ఉమయ్యాద్ () వంశఖలీఫాలు (661–750) రోమన్, పర్షియా రాజ్యాలలో చాలాభాగం తమ పలుకుబడిలోకి తెచ్చుకున్నారు. తూర్పున సమర్‌ఖండ్, కంధహార్‌లవరకు; పశ్చిమాన స్పెయిన్, పోర్చుగల్ వరకు కూడా రాజ్యవిస్తరణ కావించారు. కానీ తర్వాత వచ్చిన అబ్బాసిద్ వంశీయుల పాలనలో (751–850) ఖలీఫాల ప్రాబల్యం తగ్గిపోయింది. వారిపాలనలో ఉన్న ప్రాంత ప్రతినిధులు దాదాపు అందరూ స్వతంత్రం ప్రకటించుకున్నారు. ఖలీఫాలకు నామమాత్రంగా గుర్తింపునిచ్చారు. మన హిందూ దేశానికి సంబంధించినంత వరకు పర్షియా రాజధానిగా సబక్తజిన్ (గజనీ 977–997) మొదటిసారిగా మన దేశ సరిహద్దులు తాకినాడు.తర్వాత 997 నుండి 1399 వరకు అంటే కబీర్ పుట్టినంత వరకు 422 సంవత్సరాలు–మహమ్మద్ గజనీ, మహమ్మద్ గోరీ, వారి వారసులు దండయాత్రలు చేసి చాలా భూభాగం తమ అధీనంలోకి తెచ్చుకున్నారు. గోరి దండయాత్రల తర్వాత ఆయన ప్రతినిధి ఇల్తమష్, అతని సంతతి బానిస జాతి బాల్బన్, అక్కడే పుట్టి



పెరిగిన అల్లావుద్దీన్ ఖిల్జీ మొదలైనవారు ఉత్తర భారతమంతా ఆక్రమించి పరిపాలించారు. ఈ 422 సంవత్సరాల దీర్ఘకాలంలో భారతదేశం వారికి జన్మస్థానమయ్యింది. ముస్లింల సంతతి తామరతంపరలా పెరిగిపోయింది. ఈ ముస్లింలు చాలమంది నాథ్ సంప్రదాయాన్ని పాటించేవారు. వీరిలో ముఖ్యంగా చేనేత పనివారు (जुलाहा) ఎక్కువ. కబీర్ కాలం నాటికి 40,000కు తక్కువ  కాకుండా ముస్లిం నాథ్ సంప్రదాయకులుండే వారట. నీరూ (కబీర్ తండ్రి) ముస్లిం జులాహీ అని, నాథ్ పంత్ సంప్రదాయకుడని ముందే మనం చెప్పుకున్నాం.

**సూఫీలంటే ఎవరు?:–** కబీర్ సూఫీ సంత్ కవి. విశ్వమే దైవమనే భావనతో అల్లాను ఆరాధించేవారిని సూఫీలంటారు. దీనికి మూలం ఇస్లాం మతంపై గల గ్రీకు హేతువాద ప్రభావం. దీనికి ఆద్యుడు ఇస్లాం మత పెద్ద 'అహారి'. ఆయన తన వాదాన్ని తర్కం మీద ఆధారపడిన నమ్మకమైన సౌథమని సమర్థించుకున్నాడు. కొరాన్‌లోని కొన్ని అంతరార్థంగల వ్యాఖ్యలకు వివరణయిచ్చి ఆచరించిన కొందరు ముస్లిం రససిద్ధులు సూఫీ తత్త్వానికి ఆద్యులు. ప్రవక్త మరణానంతరం రెండు శతాబ్దాలలోపే పవిత్రతను పాటించే కొందరు ముసల్మానులు దారిద్ర్యంతో సాధారణ జీవితం గడిపితే ముక్తిపథం సాధ్యమని భావించారు. సన్యాసి రూపం సంతరించుకోవడానికి వారు రంగు వెలిసిపోయిన ముతక ఉన్ని వస్త్రాలు ధరించేవారు. ఉన్ని అంటే అరబిక్ భాషలో 'సఫ్' () అంటారు. దీనివల్లనే 'సూఫీ' అనే పేరొచ్చిందంటారు.

తొమ్మిదో శతాబ్దంలో సంప్రదాయిక మత నాయకులు తమ ఐహిక సుఖాలకోసం నామమాత్రంగా ముస్లిం మత కర్మాచరణ చేసేవారు. ఆధ్యాత్మిక సాధనకోసం ప్రయత్నించే వారు కాదు. ఈ దుర్నీతిని సహించలేని సూఫీలు ఆంతరంగిక ఆధ్యాత్మిక జీవిత సాధనవైపు దృష్టి మళ్ళించారు. మానసికావేశంలో, భక్తిభావనతో నిర్వికార బ్రహ్మైకత్వం స్వయంగా పొందగలమని భావించారు. మానవునిపై భగవంతునికి గల ప్రేమానురాగాలు తేటతెల్లం చేయడానికి కొరాన్ లోని ఒక 'సూరా' – దేవుడు మనిషికి తన మెడలోని 'నరం'ఎంత దగ్గరో ఆయన కూడా మనిషికి అంత దగ్గరివాడని – తరచు ఉల్లేఖించేవారు. కొందరు సూఫీలు మధ్యయుగపు ఫకీర్లవలె తమ దివ్యవాణిని ప్రజలకు బోధిస్తూ భిక్షమెత్తుకుంటూ పల్లె పల్లెకూ తిరిగేవారు. మరికొందరు కఠినమైన క్రమశిక్షణతో ఆధ్యాత్మిక జీవనం గడుపుతూ భగవంతునిలో ఐక్యం కావాలనుకునేవారు. వీరందరికీ మూలధ్యేయం ఒక్కటే – భగవంతుని సాన్నిధ్యం.

ఇద్దరు సూఫీ భక్తుల జీవనవిధానాన్ని ఈ సందర్భంగా ముచ్చటించుకుందాం. రబియా అనే సూఫీ మహిళ దేవుని యిలా ప్రార్థించింది. "నేను నరకమంటే భయపడి

నిన్ను ప్రార్థిస్తే, నన్ను ఆ నరకంలోనే కాల్చేయ్! స్వర్గలోక సౌఖ్యాలు కావాలని ప్రార్థిస్తే అక్కడి నుండి నన్ను క్రిందికి త్రోసివెయ్! నేను ప్రార్థించేది నీకోసం, నీ అనంతమైన వాత్సల్యం కోసమే!" రజియావంటి చాలామంది సూఫీతాత్త్వికులను ఆనాడు గౌరవించారు.

తొమ్మిదో శతాబ్దంలో హల్లాజీ అనే తాత్త్వికుడు తానే నిజానికి ప్రతిబింబమన్నాడు. దీన్ని మతపెద్దలు "అతను తన్నుతానే దేవుణ్ణని అంటున్నా"డని అర్థమనీ, ఇది ఖురాను ప్రవచనాలకు వ్యతిరేకమని వివరణ యిచ్చి ఆనాటి ఖలీఫాకు హల్లాజీకి మరణశిక్ష వేయమని విన్నవించారు. ఖలీఫా మరణశిక్ష విధించాడు. శిక్ష అమలుపరిచే నాటికి హల్లాజీకి 64 ఏళ్ళ వయస్సు. ఆ శిక్షయినా అతి భయంకరమైనది – ముందు కొరడాతో విపరీతంగా కొట్టి, శరీరంలోని కండలను ఒకటొకటిగా కోస్తూ తలనరికారు.

ఈ భయంకర పరిణామం సూఫీ భక్తిభావన విస్తరణను నిరోధించలేకపోయింది. 12వ శతాబ్దంలో ఈ ఛాందసమత సాంప్రదాయకవాదులు సూఫీలను అనుమానాస్పదంగా చూడడం మానుకున్నారు. ఈ సమన్వయ ఘనత ధర్మస్వరూపుడైన 'ఘజాలి' కి దక్కుతుంది. ఆయన సనాతన సంప్రదాయాన్ని కాదనలేదు, కాని సూఫీలు కూడా గౌరవార్హులు అని చాటిచెప్పాడు. అందరూ దీనికి అంగీకరించారు. ఈ సందర్భంగా మనం గుర్తించవలసిన విషయం – కబీర్ సూఫీతత్త్వానికి పట్టాభిషేకం జరిగిన తర్వాతనే క్రీ.శ. 1399 లో జన్మించాడని.

నిరాకారుడైన 'నిర్గుణ బ్రహ్మ భక్తి' ప్రచారం చేయడం, హిందూ ముస్లింల మత సమన్వయం కోసం జీవితాంతం పాటుపడడం, చదువుకోకపోయినా సాధుసాంగత్యంతో పదునైన సాఖీలు, శబద్‌లు, రమైనీలు ప్రవచిస్తూ రెండుమతాల వారి మూఢాచారాలను నిర్ద్వంద్వంగా ఖండిస్తూ వాళ్ళను చైతన్యపరుస్తూ, బట్టలు నేస్తే వచ్చే స్వల్పాదాయంతోనే సాధారణ గృహస్థ జీవితం సంతృప్తిగా గడిపాడు. కాశీలో మరణిస్తే స్వర్గప్రాప్తి, 'మగహర్' *(మగహర్– కాశీకి దరిదాపుల్లోని ఒక చిన్నగ్రామం)* లో గతిస్తే నరకప్రాప్తి కలుగుతుందని ఆనాటి సామాజికుల మూఢనమ్మకాన్ని త్రోసివేసి తన 120వ యేట కాశీ వదిలి 'మగహర్'కు వచ్చి –

चाह गई चिंता मिटी मनुआ बेपरवान ।
जो कभु न चाहिए सोई शाहंशाह ।।

అంటూ శెలవు తీసుకున్న ధీశాలి కబీర్. ఆయనను గురించి ఎంత చెప్పినా తక్కువే!

తెలుగులో శతకం వ్రాసినా కవిగా గుర్తింపు పొందలేకపోయి, సంఘసంస్కర్తగానే మిగిలిపోయిన వేమన (A.D.1650–1700) సమాజసుధాకర మహనీయుడుగా గుర్తుకొస్తాడు. కబీర్‌కు ఈయనకు సామ్యముంది –



**కడుపు చిచ్చుచేత కామానలముచేత**
**క్రోధ వహ్నిచేత కుటిలపడక**
**ఒక్క మనసుతోడ నుండిననే ముక్తి**
**విశ్వదాభిరామ వినురవేమ!**

కబీర్, వేమనల భావసామ్యం పై వేమన పద్యంలో కనిపించడం లేదూ...??

ఈ మధ్యనే వేమన తల్లిగారి సమాధి కడపజిల్లా, కోడూరుకు సమీపంలోని చిన్న గ్రామంలో వెలుగుచూసిన సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కడపజిల్లాకై ప్రత్యేకంగా ఏర్పాటుచేసి, విశ్వవిద్యాలయానికి 'యోగివేమన' యూనివర్సిటి అనే పేరు పెట్టి ఆయన చేసిన సామాజిక సేవకు, సంఘసంస్కరణకు తమ ఋణం– అల్పంగానైనా తీర్చుకున్నారు.

101 కబీర్ ఏకేశ్వరోపాసన పదాలను తనదైన మధురశైలిలో, తెలుగుభాషకు, జాతీయత తీర్చిదిద్దినట్లు, సరళసుందరంగా, ప్రతిభావంతంగా అనుసృజనం చేసిన డా॥ లలితారాణి, M.A., Ph.D. గారు, ఎంతో అభినందనీయురాలు. ఆధ్యాత్మిక పదాలైనాసరే పాఠకులకు ఏకబిగిన ఆసాంతం చదివింపజేయడం ఈ కృతిమహత్వం. రాత్రి గం. 12–00 ల నుండి తెల్లవారుజాము గం. 2–00 ల వరకు ఈ అనుసృజనాన్ని చదువుతున్న నాకు ఎక్కడో దూరాన పచ్చిక బయళ్ళ గట్టుమీద వసంతంలో మామిడి చివుళ్ళనారగించి మనోరంజకంగా వినిపించే కోకిల కలకూజితాలను మందమలయ మారుతం మోసుకొని వచ్చి పారవశ్యానికి గురిచేసిన అనుభూతికి గురి అయ్యాను. మచ్చుకు ఒకే ఒక పదం వినిపిస్తాను–92వ పదం చూడండి–కబీర్ ఏకేశ్వరోపాసన తత్త్వమంతా వడబోసినట్లుంది–

***ఈ సంపద ... ఈ తనువూ ... ఈ నశ్వరముల కేమి విలువ ...?***
***చూస్తూ ... చూస్తూ ఉండగానే ... మట్టిలో కలిసిపోతాయి ...!***
***నీ కోసం నిర్మించబడినదీ మహలు ...***
***కానీ ..., చివరకు ...***
***నీ వెళ్ళి ... నిద్ర పోయింది ... అడవి గర్భంలో ...!***
***కట్టెలా ... కాలిపోయింది ... నీ శరీరం ...!***
***కేశాలు ... గడ్డిపోచలుగా ... దహనమయ్యాయి ...!***
***కబీరు చెప్తున్నాడు ... విను ...!***
***ఓ సాధూ ...! నీ చావుతోనే ... నీ ప్రపంచం ...***
***సమాప్తమై పోతుంది ...!!***

ఈ అనుసృజన కబీర్ పదాలకు ప్రముఖ సంగీతజ్ఞులెవరితోనైనా స్వర సృజన చేయించి – కళ్యాణి, బిలహరి, శంకరాభరణం, శుద్ధకళ్యాణి, కాఫీ, మోహన, షణ్ముఖప్రియ, కుంతలవరాణి, మలయమారుతం మొదలైన కర్ణాట రాగాలతోను, తిలకామోద్, పహాడ్, సారంగ్ మొదలైన హిందుస్తానీ రాగాలతోను పాడించి, సి.డి.లు చేయించే ఆర్థికసహాయం చేసి, దైవాన్ని మరచిన ఈ ప్రపంచానికి జీవితమంటే ఏమిటో తెలియజేసి, భగవన్నామస్మరణలోని మాధుర్యాన్ని రుచిచూపించగలిగిన దాత దొరికితే ఎంత అదృష్టం...!!

హైదరాబాద్ భాషాసేవకుడు
06-03-2010 **కోడూరు పుల్లారెడ్డి**

---

## ఉపయుక్త గ్రంథాలు :-


| | | |
|---|---|---|
| 1. | కబీర్ సమగ్ర్-1 | సంపాదకుడు – ప్రొ॥ యోగేశ్వర్ (హింది) |
| 2. | కబీర్ సమగ్ర్-2 | సంపాదకుడు – ప్రొ॥ యోగేశ్వర్ (హింది) |
| 3. | హిందీ సాహిత్య్ కా ఇతిహాస్ | ఆచార్య రామచంద్రశుక్ల్ (హింది) |
| 4. | కబీర్ | ఆచార్య హజారీ ప్రసాద్ ద్వివేది (హింది) |
| 5. | నాథ్ సంప్రదాయ్ | ఆచార్య హజారీ ప్రసాద్ ద్వివేది (హింది) |
| 6. | కబీర్ గ్రంథావళి | డా॥ శాంతి ప్రసాద్ గుప్త్ (హింది) |
| | | డా॥ సురేష్ అగర్వాల్ (హింది) |
| 7. | కబీర్ గ్రంథావళి | ఆచార్య పుష్పపాల్ సింహ్ (హింది) |
| 8. | హిందీ కే ప్రాచీన్ ప్రతినిధి కవి– | డా॥ అశ్వనీ పరాశర్ (హింది) |
| 9. | భగవద్గీత | భూమానందాశ్రమ (కడపజిల్లా) సంకలనం (సం) |
| 10. | వేమన పద్యరత్నాకరం | సంకలనం (తెలుగు) |
| 11. | History of Arabs | Philip K. Haitti (English) |
| 12. | Early Islam | Desmond Stewart (English) |
| 13. | The life of Mohammed | A.M. Siddiqui (English) |
| 14. | Koran | N.J. Dawood (English) |
| 15. | An advanced History of India - | Dr. R.C. Majumdar |
| | | Dr. H.C. Roy Choudary |
| | | Dr. Kali Kindar Batka. |




# ఓ పలుకు ...!

*__"ఆత్మజ్యోతి"__ ఆధ్యాత్మిక-వైజ్ఞానిక మాసపత్రికలో ధారావాహికగా ప్రచురింప బడుతున్న __"కబీరువాణి"__ నేడు పుస్తక రూపాన్ని సంతరించుకొన్నది.*

*'సహృదయ' నామముతో దీనిని అందించినది టి.ఆర్.ఆర్. గవర్నమెంట్ జూనియర్ కాలేజి, కందుకూరులో లెక్చరర్‌గా పనిచేస్తున్న __డా॥ శ్రీమతి సూర్యదేవర లలితారాణి గారు.__*

*'కబీరు పదాలకు' వీరు చేసిన అనుసృజన అద్వైతరసానుభూతిని కలిగిస్తూ 'ఆనందడోలికల్లో మునకలు వేయిస్తుంది' అనటం అతిశయోక్తికి ఆమడదూరమని చెప్పక తప్పదు.*

*ఈ గ్రంథానికి చక్కని పీఠికను __"పరితోషం"__ పేరిట అందించిన జ్ఞాన వృద్ధుడు, వయోవృద్ధుడు అయిన __శ్రీ కోడూరు పుల్లారెడ్డి గారికి నమస్సులు.__*

*__శ్రీశ్రీశ్రీ స్వామి అరుళానందసరస్వతివారి__ శుభాశీస్సులతో శ్రీ సదాశివ బ్రహ్మేంద్రాశ్రమము, చిల్లకల్లు ద్వారా ఈ గ్రంథం వెలువడటం ఆనంద దాయకం.*

***శ్రీ స్వామివారికి నమస్కరిస్తూ ...!***

**రామోరా**
*గౌరవసంపాదకుడు*
**ఆత్మజ్యోతి**
*ఆధ్యాత్మిక-వైజ్ఞానిక మాసపత్రిక*

## కబీరువాణి - 1

मोको कहाँ ढूंढेरे बंदे में तो तेरे पास में ।
ना तीरथ में ना मूरत में ना एकांत निवास में ।
ना मंदिर में ना मसजिद में ना काबे कैलास में ।
मैं तो तेरे पास में बंदे मैं तो तेरे पास में ।
ना मैं जप में ना मैं तप में ना मैं बरत उपास में ।
ना मैं किरिया कर्म में रहता नहीं जोग सन्यास में ।
खोजी होय तुरत मिल जाऊं एक पल की तलास में ।
कहे कबीर सुनो भई साधो मैं तो हूं बिस्वास में ॥

*ఓ మనిషీ! ఎక్కడెక్కడో*
*నా కోసం వెతుకుతావెందుకు...?*
*నేనున్నది నీ చెంతే గదా ...!*
*మందిర – మసీదుల్లోనో ...*
*కాబా–కాశీలల్లోనో ...*
*దేవాలయాల్లోనో ...*
*ఏకాంతప్రదేశాల్లోనో నేను లేను గదా ...!*
*ఎందుచేతంటే నేనున్నది నీ చెంతనే ...! నీ చెంతనే ...!!*
*జపంతో – తపంతోనో ...*
*వ్రతంతో – ఉపవాసంతోనో ...*
*క్రియాకర్మలతో, యోగసన్న్యాసాలతో నను చేరలేవు ...*
*నే చెప్పేది జాగ్రత్తగా విను ...*
*ఆర్తితో నన్ను వెతికావా ...*
*మరుక్షణం నీ ఎదురుగ నేనుంటా ...!*
*నీపై విశ్వాసంతో ....!!*



## కబీరువాణి - 2

राम रहीम एकै है रे काहे करो लराइ ।
वोहि निरगुनिया अगम अपारा तीनो लोक सहाइ ।
बेद पढंते पंडित है गये सत्य नाक नहिं जाना ।
कहे कबीर ध्यान भजन से पाया पद निर्बाना ।
एकहि माटि की सब काया ऊंच नीच कउ नाहिं ।
एकहि जोति बरें कबीरा सबकी अंतर माहिं ।
एहु अनमोलक जीव पायो सदगुरु सबद ध्यायो ।
कहे कबीर पलक में सारि एक अलख दरसाओ ॥

*కబీరు అంటున్నాడు ....*
*ఊరకే పోరులెందుకు ...?*
*రామ్, రహీము లొక్కరే గదా ...!*
*నిరాకార నిర్గుణుడాతడు ...*
*ముల్లోకముల బ్రోచువాడు ...*
*వేద, పొత్తములు జదివిన నేమి ఫలము ...*
*సత్యరూపము నెరుగకున్న ...?*
*ధ్యాన ... సంకీర్తనముతో*
*కబీరు పరమపదము చేరువాయె ...*
*హెచ్చుతగ్గుల తేడాలెందుకు ...*
*సర్వభూతములయందలి బీజమొక్కటే ...*
*అందరి యందు వెలిగెడి ఆ పరంజ్యోతి ఒక్కటే ...*
*దుర్లభమైనదీ మానవజన్మము ...*
*సద్గురుబోధలు వినుకో ...*
*పరమాత్మను చేరెడి మార్గము నందుకో ...!!*

## కబీరువాణి - 3

 पानी में मीन पियासी मोहि सुनि सुनि आवत हांसी ।
घर में बस्तु धरी नहिं सूझै, बाहर ढूंढन जासी ।
मृग की नाभि मांहि कस्तूरी, बन बन खोजत बासी ।
आतम ज्ञान बिना सब झूठा क्या काबा क्या कासी ।
गंगा जाय गोदावरी कीन्ही भक्ति बिना सबनासी ।
जलथल सागर पूर रहया है भटकत फिरै उदासी ।
कहे कबीर सुनो भई साधो सहज मिलै अविनासी ।।

 *నీటిలోని చేపకు దాహం అంటే ...*
*విని నాకు నవ్వొస్తుంది ...!*
*వస్తువు ఇంట్లో పెట్టి ...*
*ఊరంతా వెతికిన చందాన ఉంది.*
*కస్తూరి మృగం తన బొడ్డులోని సుగంధంకోసం*
*గడ్డినంతా వెతికినట్లున్నది.*
*ఆత్మజ్ఞాన మెరుగకున్న అంతయు వృథా...!*
*కాబా దర్శనమేల...?*
*కాశీ యాత్రలేల...?*
*భక్తిలేని గంగా గోదావరీ పుణ్యస్నానములేల...?*
*ఎందుకీ వృథా ప్రయాస....?*
*ఆ సర్వాంతర్యామి ...*
*జలథల సాగరములంతటా నిండేయున్నాడు గదా...!*
*ఓ సాధూ! కబీరు చెప్తున్నాడు విను...!*
*నిజమైన భక్తునికి ... భగవంతుని చేరు మార్గమెంతో సులువు...!!*



## కబీరువాణి - 4

 मन न रंगाय रंगाय जोगी कपड़ा ।
आसन मार मंदिर में बैठे,
ब्रह्म छाड़ि पूजन लागे पथरा ।
कनवा बढ़ाय जटवा बढ़ौले,
दाढ़ी पढ़ाय जोगी है गैले बकरा।
जंगल जाय जोगी धुनिया रैमाले,
काम जराय जोगी है गैले हिजारा ।
मथवा मुंडाय जोगी कपड़ा रगैले,
गीता बांच कै है गैले लबरा ।
कहहिं कबीर सुनो भई साधो,
जम दरवाजा बांधर जैबे पकड़ा ।।

 *కాషాయం ధరిస్తాడు .... కానీ, మనసు సన్యసించదు ...!*
*ఆసనమేసి మందిరంలో బైఠాయిస్తాడు ...*
*పరబ్రహ్మను మరచి రాతిబొమ్మను సేవించుతాడు ...*
*చెవులు కుట్టించుకుని ... జటాజూటాన్ని పెంచుతాడు ...*
*మేకపోతులాగా గడ్డాన్నీ పెంచుతాడు ...*
*అడవికి పోతాడు ...*
*అక్కడ అగ్గిలో 'కోరిక'ని బుగ్గిచేసానంటాడు ...*
*నిర్వికారుడ నంటాడు ...*
*శిరోముండన మంటాడు ...*
*కాషాయం కడ్తాడు ...*
*గీతావచనం అంటాడు ...*
*కానీ ...*
*ఓ సాధూ! కబీరు చెప్తున్నాడు విను ...!*
*చివరకు అలాంటివాడినీ కట్టకట్టి తీసుకుపోయేది ...*
*తిన్నగా నరకానికే ...!!*

## కబీరువాణి - 5

- सांइ की नगरिया जाना है रे बंदे ।
जग नहिं अपना बेगाना है रे बंदे ।
पत्ता टूटा डार से ले गयो पवन उड़ाय ।
अब के बिछड़े ना मिले दूर पड़ेंगे जाय ।
माली आवत देख के कलियन करे पुकार ।
फूले फूले चुन लिये कालि हमारी बार ।
चलती चक्की देख कर दिया कबीरा रोय ।
दुई पाटन के बीच में, साबित बचा न कोय ।
माटी कहै कुम्हार से, तू क्या रूंदै मोय ।
इक दिन ऐसा आयगा, मैं रूंदूंगी तोय ।
लकड़ी कहै लुहार से, तू मत जारे मोहि ।
एक दिन ऐसा होयेगा, मैं जारूंगी तोहि ।
बंदे तू कर बंदगी, तो पावै दीदार ।
अवसर मानव जनम का बहुरि न बारंबार ।
कबीरा सोया क्या करे, जाग न जपे मुरारि ।
एक दिन है सोवना, लंबे पांव पसारी ॥

- *ఓ మనిషీ! నీవు ప్రభుదామానికి వెళ్ళాలి ... ఈ జగం కాదు నీకు శాశ్వతం...
గాలి వీచింది ... పండుటాకు కొమ్మనుండి జారింది ... ధూళిలో పడింది ...
మళ్ళీ ఆ ఆకు ఈ కొమ్మ ఒక్కటవుతాయా ...??
తోటలోకి వచ్చిన మాలినిచూసి మొగ్గలన్నాయి -
ఈ తూరికి పూలెంచుకో ... మావంతు రేపులే ... అని
విసరే 'తిరగలిని' చూచిన కబీరు బాధతో అంటున్నాడు -
అందులోని గింజలేవీ తప్పించుకోలేవు ... అన్ని పిండి కావలసిందే ...
కాళ్ళక్రింద నలిగే మట్టి కుమ్మరితో అన్నది - నన్ను నీవు మర్దనచేసేదేమిటి?
నిన్ను నేను మర్దించే 'ఆ రోజు' వస్తుంది ...
కుమ్మరితో కొయ్య ముక్క అన్నది - నన్ను ఇలా కాల్చకు ...
ఒకనాటికి నేనూ నిన్ను బూడిద చేసేరోజు వస్తుంది ...
కబీరు చెప్తున్నాడు వినుకో ...! ఓ మనిషీ ...! దుర్లభ మీ మానవజన్మము ...
సమయం వృథా చేసుకోకు ... మేలుకో ... నిదుర మేలుకో ...
పరమాత్ముని కీర్తించు ...! స్మరించు ...! ధ్యానించు ...!
ఎప్పటికైనా కాళ్ళుబాఅచాపి శాశ్వతనిదురలోకి వెళ్ళక తప్పదు ...!!*



## కబీరువాణి - 6

- आवै न जावै मरै नहिं जनमै सोइ निज पिव हमारा है ।
ना प्रथम जननी ने जनमौ ना कोइ सिरजन हारा है ।
साधन तीरथ मुनि ना तपस्या ना कोइ बरत आचारा है ।
ना खट दरसन चार बरन में ना आस्रम व्यवहारा है ।
ना श्रीदेवा सोहम् सक्ति निराकार से पारा है ।
सत्य अतीत अटल अविनासी ना ओम ओंकारा है ।
धरनी ना गगन पवन ना पानी ना रबि चंदा तारा है ।
हों परगाट परतीत नाहिं, सदगुरु सैन सहारा है ।
कहे कबीर सर्बही साहेब परख्यो परखन हारा है ॥

- *'పుట్టుట - గిట్టుటలు' లేనివాడు ...,
నా ప్రభువు ఆదిమధ్యాంతరహితుడు ...
తపస్సులూ - ఉపసనలూ ...
తీర్థయాత్రలూ - ఆశ్రమాలూ ...
ఆచారాలూ - వ్యవహారాలూ ...
ఆ తండ్రిచెంతకు చేర్చలేవు సుమండీ...!
ఆయన దర్శనానికి కఠిన పూజలూ లేవు ...
నిర్ణీత సమయాలూ లేవు ...
ఆ తండ్రి! ఓంకారుడా...? కాదు ... నిరాకారుడూ కాదు ...
అవనియా ... ఆకాశమా ... పవనమా ... నీరమా ...
తారారవిచంద్రులా ...
ఏదియూ కాదు ... అనుభూతి మాత్ర గమ్యుడాతడు ...
సత్యాతీత ... అవినాశ అవ్యయతత్త్వుడు ...
సద్గురు బోధ యొక్కటే తన్ను చేర్చు సాధనము ...
ఆ సాధకుడొక్కడే పరమాత్మానుభూతి నొందువాడు ...!!*

# కబీరువాణి - 7

- अरे दिल गाफिल गफलत मत कर एक दिन जम तेरा आवेगा।
सौदा करने को या जग आया, पूंजी लाया मूल गँवाया ।
प्रेम नगर का अंत न पाया, ज्यूं आया त्यूं जावैगा ।
सुन मेरे साजन सुन मेरे मिता, या जीवन में क्या क्या बीता ।
सिर पाहन का बोझा किता, आगे कौन छुड़ावेगा ।
परली पार मेरा मिता खड़िया, उस मिलन का ध्यान न धरिया।
टूटी नाव पर जो बैठा, गाफिल गोता खावैगा ।
दास कबीर कहै समुझाइ, अंत काल तेरा कौन सहाइ ।
चला अकेला संग न कोइ, किया आपना पावैगा ॥

- *ఓ మనసా! జాగృథ! జాగృథ! తప్పుచేయకు ...!!*
*ఒకనాటికి యముడొచ్చి కూర్చుంటాడు ...*
*పెట్టుబడితో వ్యాపారం చేయటానికి ఈ లోకానికొచ్చావు ...!*
*మూలధనాన్నే పోగొట్టుకున్నావు ...!!*
*ఈ లోకపు పోకడ నీకు పూర్తిగా పొడగట్టనేలేదు ...!*
*ఇలా వచ్చావు ... అలా వెళ్తున్నావు ... ఒట్టి చేతులతో ...!*
*మిత్రమా! నా మాట విను ... ఈ బ్రతుకెంత భారం ...!!*
*కొండంత బరువు నీ నెత్తి మీద ...! ఎవరొచ్చి దించుతారు ...?*
*ఆవలి ఒడ్డున నా చెలికాడు నిలచి ఉన్నాడు ...!*
*నీ చివరి మజిలీ అతడేనన్న ధ్యాసే నీకు లేదే ...??*
*నీవు కూర్చున్న నావ ఓటిది ... మధ్యలోనే పుట్టి మునుగుతుంది ...!*
*కబీరు మళ్ళీ చెబుతున్నాడు విను ...!*
*అంత్యకాలం సమీపించినప్పుడు ... నీకు సాయపడటానికి,*
*నీకు తోడుండటానికి ఎవ్వరూ ఉండరు ... ఒంటరిగా సాగాలి ...*
*నీ పాపపుణ్యాల ఫలాలు మాత్రమే నీకు చెందుతాయి ...!!*



# కబీరువాణి - 8

- चलना है दूर मुसाफिर काहे सोवै रे ।
चेत अचेत नर सोच बावरे, बहुत नींद मत सोवै रे ।
काम क्रोध लोभ मद में फंस कर, उमरिया काहे खोवै रे ।
सिर पर माया मोह की गठरी, सगं दूत तोर होबै रे ।
सो गठरी बीच में छिन गइ, मुंड पकरि काहे रोवै रे ।
रास्ता तो दूर कठिन है चलबा अकेला होवै रे ।
संग साथी तेरो कोइ न चलेगा, काके डगरिया चोबै रे ।
नदिया गहरी नाव पुरानी, केहि बिधि पार तु होबै रे ।
कहे कबीर सुनो भइ साधो, ब्याज धोके मूल मत खोबै रे ।
चलना है दूर मुसाफिर काहै सोवै रे ।

- *ఓ బాటసారీ ...! బహుదూరం సాగాలి ...*
*ఈ మత్తునిద్ర వదలవేలనో ...?*
*పిచ్చివాడా ...! ఆ చేతనాచేతనరూపుని గనరా ...!*
*మొద్దు నిద్దుర వద్దురా ...!!*
*కామక్రోధలోభమదమోహాలకి బానిసవైతివి గదరా ...!*
*అమరత్వము నెరుంగకుంటివి ...!*
*మాయామోహాల మూట నెత్తికెత్తుకు తిరుగాడితివి ...!*
*మధ్యదారిలో ఆ మూట జారిపోయిన రోజున ...*
*నెత్తి బాదుకు ఏడ్చి ఏమి లాభం ...?*
*నీ మజిలీ బహుదూరం ... బహుకష్టం ...!*
*తోడెవ్వరూ లేరు ... రారు ...!*
*నీ నావ చుక్కాని పట్టేదెవరు ...?*
*ఈ ఓటి పడవలో అంతలోతు నదినీ దాటేదెలా ...?*
*ఓ సాధూ ...! జాగ్రత్తగా విను ...!!*
*వడ్డీ ఆశతో 'అసలు' పోగొట్టుకోకు ...!*

## కబీరువాణి - 9

- मन तोहे केहि विधि मैं समझाऊं ।
  सोना होय सुहागा मंगाउं बंक नाल रस लाउँ ।
  ग्यान सबद का पुंक चलाउं पानी कर पिघलाउँ ।
  घोड़ा होय लगाम लगाउं ऊपर जीन कसाउं ।
  होय सवार तेरे पर बैठूं चाबुक दे के चलाउं ।
  हाथी होय जंजीर गढाऊं, चारों पैर बंधाऊं ।
  होय महावत तेरे पर बैठूं अंकुस ले के चलाऊं ।
  लोह होय ऐरण मंगाउं उपर धुवन धुवाउँ ।
  धुवन की घन घोर मचाउँ जंतर तार खिचाउं ।
  ग्यानी न हो ग्यान सिखाउं सत्य की राह चलाउं ।
  कहत कबीर सुनो भइ साधो अमरापुर पहुंचाउं ।

- *ఓ మనసా ...! నీ కెలా తెలియచెప్పేది ...!!*
  *నీవు బంగారానివైతే ... రసరాజమద్ది ...*
  *జ్ఞానమనే గాలి ఊది ... కొలిమి కాల్చి ...*
  *మేలిమిగా చేయక పోదునా ...*
  *నీవు గుఱ్ఱానివైతే ... జీను బిగించి ... కళ్ళాలు వేసి ...*
  *కొఱడా చేతపట్టి ... మజిలీకి చేర్చనా ...*
  *నీవు ఏనుగై ఉంటే ... గొలుసులతో బంధించి ...*
  *మావటినై ... మూపునెక్కి ...*
  *అంకుశంతో దారికి తేక పోదునా! ...*
  *లోహానివైతే ... కొలిమిలో కాల్చి ... కరిగించి ...*
  *యంత్రపు తీవెలుగా మార్చే వాడిని ...*
  *అజ్ఞానివైతే జ్ఞానబోధ చేసేవాడిని ...*
  *సత్యమార్గాన నడిపేవాడిని ...*
  *ఓ సాధూ! కబీరు చెబుతున్నాడు విను ...!*
  *నిన్ను మోక్షధామం చేర్చేవాడిని నేనే ...!!*



## కబీరువాణి - 10

- चादर हो गइ बहुत पुरानी, अब तो सोच समझ अभिमानी ।
  अजब जुलाहा ये चादर बीनी सूत करम का तानी ।
  सुरति निरति को भरनी दीनी तब सब को मनमानी ।
  मैली दाग परे पापन की, बिसयन में लिपटानी ।
  ग्यान का साबुन लाय न धोओ, सत संगत के पानी ।
  भई खराप अब गइ सारी लोभ मोह में सानी ।
  ऐसेइ ओढ़ते उमर गंवाइ भली बुरी नहिं जानी ।
  संका मति जान जीय अपने है इह बसु बिरानी ।
  कहै कबीर यह राखु जतन से नहिं फिर हाथ न आनी ॥

- *ఇక నీ శాలువా పాతదయింది ... చినుగు పట్టింది ...*
  *దాని మీద నీ వ్యామోహాన్ని వదిలిపెట్టు ...*
  *ఆ నేతగాడు 'కర్మ'లనే పడుగు పేకలతో ...*
  *ఈ చిత్రమైన శాలువా నేశాడు.*
  *దానిమీద భక్తి, ప్రేమలనే 'బూటా' లు దిద్దాడు ... సంతసించాడు ...!*
  *కానీ ... దాన్ని నీవు పాపాల మఱకలతో ...*
  *ఋణానుబంధాల మురికితో మైలపరిచావు ...*
  *నీవు దాన్ని సజ్జనసాంగత్యమనే నీటిలో ...*
  *జ్ఞానమనే సబ్బుతో ... ఉతకక పోతివే ...!!*
  *ఆశావ్యామోహాల మసిని పూసి ... మరింత మురికి చేసావు ...*
  *మంచీచెడులు గ్రహించకుండా ... అలాగే కప్పుకు తిరిగావు ...*
  *కబీరు చెప్తున్నాడు విను ...!*
  *ఈ శాలువా మళ్ళీ మళ్ళీ నీకు దొరకుట దుర్లభము ...*
  *అంచేత దానిని జాగ్రత్తగ ఉపయోగించు ...!!*
  *(ఇక్కడ 'శాలువా' మనిషి శరీరానికి ప్రతీక)*

## కబీరువాణి - 11

 झूठा लोग कहें घर मेरा ।
जा घर माही बोले डोले, कोइ नहीं तँह तेरा ।
बहुत बांध्या परिवार कुटुंम में कोइ नहीं किसि केरा ।
बस्ती में थे मारि चलाया जंगल किया बसेरा ।
जीवत असिनु अंखियां देखी संसार अंध अंधेरा ।
कहे कबीर राम भजहुरे, बहुरि न होगा फेरा ॥

 *ఈ మనుష్యులనుకొంటారు ...*
*ఈ ఇల్లు నాదని ... ఎంత అబద్ధం...!*
*ఈ ఇంట నీవు ఆడేవూ ... పాడేవూ ...*
*అది నీదికాదురా ...!*
*ఎవరెవరిని నీ వారమనుకొనేవు –*
*ఎవరూ ఎవరికి ఏమీ కారురా ...!*
*మునుపు బస్తీలో ఉన్నావు ...*
*దానినీ వదలి అడవికి వెళ్ళావు*
*నా జీవితమంతా ...*
*ఈ కళ్ళతో చూచాను ...*
*ఈ జగాన చిమ్మ చీకటి తప్ప ఏమున్నదని ...?*
*కబీరు చెప్తున్నాడు విను ...*
*రాముని స్మరించు ...!*
*మరి మరు జన్మము ఉండదు నీకు ...!!*



## కబీరువాణి - 12

 मन तुम नाहक दुँद मचाये ।
करि असनान छुवो नहिं काहु पानी फूल चढ़ाये ।
मूरत से दुनिया फल मांगे अपने हाथ गढ़ाये ।
चलद फिरत में पांव थकित भै यह दुख कहां समाये ।
झूठी काया झूठी माया झूठे झूठे झूठल खाये ।
बांझन गाय दूध नहिं दै है माखन कहाँ ते पाये ।
सांच के संग सांच बसत है झूठे नारी हठाये ।
कहे कबीर यह सांच बस्तु है सहजे दरसन पाये ॥

 *కబీరు చెప్తున్నాడు...*
*ఓ మనసా! అయ్యో...!*
*నీవెంత అయోమయంలో ఉన్నావు ...?*
*మడిగట్టుకుని పూజాపునస్కారం చేసేంతవరకు ఎవరినీ తాకవు ...!*
*నీవు చెక్కిన రాతిబొమ్మనే కోరికలు తీర్చమని వరాలడుగుతావు ...!*
*చుట్టు ... చుట్టూ ... ప్రదక్షిణలు చేసిచేసి*
*నీ కాళ్ళరిగాయే గానీ ...!*
*నీ చింత లెక్కడ తీరాయి ...?*
*గొడ్డుబోతు ఆవు పాడికి పనికొస్తుందా...?*
*మరి వెన్నకోసం ఆశపడ్తావెందుకు ...?*
*నిజం తెలుసుకో ...!*
*ఈ జగమంతా ఒకనాటికి మాసిపోవు ...*
*ఆ నిత్యరూపుని ధ్యానించు ...!*
*మిగిలినదంతా అసత్యమన్న మాట నెఱుగు ...!*
*ఆ సత్యమార్గము ననుసరించు ...! ఆ సత్యరూపుని కాంచగలవు ...!!*

## కబీరువాణి - 13

 अवधू माया तजी न जाइ ।
गिरह तज के बस्तर बांधा,
बस्तर तज के फेरी ।
काम तजे तो क्रोध न जाइ,
क्रोध तजे तो लोभा ।
लोभ तजे अहंकार न जाइ,
मान बड़ाई सोभा ।
मन बैरागी माया त्यागी सबद में सुरत समाइ ।
कहै कबीर सुनो भइ साधो यह गम बिरले पाइ ॥

 *కబీరు చెప్తున్నాడు విను ....*
*ఓ సాధూ! ఈ మాయా మోహములు ఒక పట్టాన వీడవు ...*
*ఇంటిని వదిలావు ... అడవికి చేరావు ...*
*అడవినీ వదిలావు ... సన్యాసివీ అయ్యావు ...*
*కామాన్ని వదిలావు ... కానీ క్రోధం మిగిలింది ...!*
*క్రోధాన్నీ వదిలావో ... లోభం మిగిలే ఉంది ...!*
*లోభం పోయినా ... అహంకారం నిలిచే ఉన్నది ...!!*
*మనసున సన్యసించి ...*
*మాయను త్యజించి ...*
*నామము స్మరించి ...*
*ధ్యానమున ...*
*ఎవరు పరమాత్మని నిలుపుదురో ...*
*వారే ధన్యులు ...!*
*అట్టివారలు వారు ...*
*బహు కొద్ది గదా ...!!*



## కబీరువాణి - 14

 अवधू भजन भेद है न्यारा ।
क्या गाये क्या लिख बतलाये क्या भरमे संसारा ।
क्या संध्या तरपन के कीन्हे जो नहिं तत्व बिचारा ।
ज्ञान दान का मरम न जाने बाद करे अंधारा ।
सो पाये जो करे अधारा, केवल सत्य विचारा ।
कहे कबीर सुनो भइ सारा सहित परिवारा ॥

 *కబీరు చెప్తున్నాడు ...!*
*ఓ సాధూ! పరిజనులతో గూడి జాగ్రత్తగా విను ...*
*భజనలో మర్మమెరుగు ...*
*అది ప్రాపంచికమైనది గాదు ...*
*అది పాడబడినదీ ...*
*వ్రాయబడినదీ గాదు ...*
*సంధ్యావందనమూ గాదు ...*
*వేదాంతచర్చా కాదు ...*
*జ్ఞానమూలము తెలియగలేక ...*
*చీకటిలో తడుముకుంటున్నారు ... !*
*ఎవరు 'సత్యము' నెఱుంగుదురో ...*
*వారే 'ఆతని' పొందగలరు ... !!*

## కబీరువాణి - 15

- अरे दिल प्रेम नगर का अंत न पाया ।
  ज्यों आया त्यों जायेगा ।
  सुन मेरे साजन सुन मेरे मीता
  या जीवन में क्या क्या बीता ।
  सिर पाहन का बोझा लीता, आगे कौन छुड़ावेगा ।
  परली पार मेरा मीता खड़िया
  उस मिलन का ध्यान न धरिया ।
  टूटी नाव ऊपर जो बैठा गाफिल गोता खावेगा ।
  दास कबीर कहे समुझाइ अंत-काल तेरा कौन सहाइ ।
  चल अकेला संग न कोइ, किया अपना पावेगा ।।

- *మనసా ...!*
  *ఈ లోభమోహములు వీడి అద్దణి చేరలేకున్నావు ...!*
  *ఇలావచ్చావు ... అలా వెళ్ళిపోతున్నావు ...!*
  *అయ్యో! మిత్రమా ...!*
  *ఈ జీవితాన ... ఎన్ని చవిచూడాల్సి వచ్చింది ...!*
  *కొండంత బరువు నెత్తికెత్తుకున్నావు ...*
  *అది దించేవారెవరు ...?*
  *ఆవలి ఒడ్డున నా చెలికాడు ఉన్నాడు ...!*
  *ఎదురు చూస్తున్నాడు ...!!*
  *ఆతడిని చేరాలన్న మాటే మరిచావా ...??*
  *నీ వెక్కిన నావ ఓటిది ...!*
  *నడి సంద్రంలో మునిగిపోయేట్లుంది ...!!*
  *ఈ మాట జాగ్రత్తగా విను ...!*
  *పోగాలము దాపురించినపుడు ... నీ తోడెవరూరారు ...! ఒంటరివే ...!!*
  *నీ కర్మ ఫలానికి ... భోక్తవూ నీవే ... !!*



## కబీరువాణి - 16

- तन जाने को स्वर्ग नरक है,
  हरि जाने को नाहिं ।
  जो डर से भव लोग डरत है,
  सो डर हमरे नाहिं नाहिं ।
  पाप पुण्य को संका नाहिं,
  स्वर्ग नरक नाहिं जानूं ।
  कहे कबीर सुनहुरे संतो
  जहां का तहां समाइ समाइ ।।

- *కబీరు చెప్తున్నాడు ...!*
  *తన తనువే ... సర్వస్వమనుకునే వాడికే ...*
  *కష్ట-సుఖాలూ ...*
  *స్వర్గ-నరకాలూ తెలుస్తాయి ...!*
  *భగవంతుని ఎఱిగినవాడు ...*
  *ఈ భేదభావము లెఱుగడు ...!*
  *ఈ లోకమంతా ... దేన్ని చూసి భయపడతారో ...!*
  *ఆ భయం ...*
  *నా దఱిదాపులకు కూడా చేరరాలేదు ...!*
  *నాకు పాప-పుణ్యాల చింతలేదు ...*
  *స్వర్గనరకాల ఎఱుక లేదు ...!*
  *ఎందుకంటే ... నాకు తెలుసు ...!*
  *సర్వవ్యాపకుడై ...*
  *ఆ పరమాత్ముడున్నాడు ...!!*

# కబీరువాణి - 17

- साहब हम में साहब तुम में जैसे प्राना बीज में ।
  मत कर बंदे गुमान दिल में खोज देख ले तन में ।
  सब ताप मिट जाय देही के निर्मल हो बैठी जग में ।
  कोटि सूर जंह करते झिलमिल नील सिंध सोहे गगन में ।
  अनहद घंट बाजे मृदंग तन सुख लेहि पियार में ।
  बिन पानी लागी जंह बरसा मोती देख नदीन में ।
  एक प्रेम ब्रह्मांड छाय रहयो है समुझे बिरले पूरा ।
  अंध भेदि कहा समझेंगे ज्ञान के घर ते दूरा ।
  बड़े भाग अलमस्त रंग में कबिरा बोले घट में ।
  हंस उबारन दुख निबारन आवागमन मिटे छन में ।।

- *బీజమందు ప్రాణమున్నట్లు ... నీలోనూ-నాలోనూ ఆ పరమాత్ముడున్నాడు...!*
  *అహంకారాన్ని త్యజించు ... అంతర్దృష్టితో నీలోకి పరికించిచూచుకో ...!*
  *నీతాపములన్నీ ... నశించుతాయి ...!*
  *అనంత ఆనందస్వరూపం ... అవగతమౌతుంది ...!*
  *ఆ సర్వాంతర్యామి ... దర్శనమౌతుంది ...!*
  *గగనమే ... నీలి సాగరమై తోస్తుంది ...!*
  *కోటి సూర్యప్రభలు ... మిలమిట్లు గొలుపుతాయి ...!*
  *అనాహత నాదమూ... ఘంటారావాలూ... మృదంగధ్వనులు... ప్రతిధ్వనిస్తాయి!*
  *ఆ బ్రహ్మానంద సుఖానుభూతి ... కలుగుతుంది ...!*
  *ఆకాశం నుండి నీరులేని అమియధారలు కురుస్తాయి ...*
  *ముత్యాలు మెరుస్తాయి ...!*
  *ఈ బ్రహ్మాండమంతా వ్యాపించి ఉన్న ప్రేమస్వరూపము ...*
  *ఆ సర్వము తెలియగలవారలు ... ఏ కొద్దిమందో గదా ...!*
  *అజ్ఞానానికి వశ్యులై ... అంధులు-బధిరులు అయిపోయినవారు ...*
  *ఈ పరమ సత్యమెట్లు ... తెలియగలరు ...?*
  *కబీరు చెప్తున్నాడు ...! ఏ అదృష్టవంతులు ...*
  *తమ ఆత్మలు ... పరమాత్మయందు లయించగలరో... ఆ పరమహంసలు ...*
  *దుఃఖమయమైన ... ఈ ఆవాగమన (జరామరణ) చక్రమునుండి ...*
  *ముక్తిపొందగలరు ...!!*



# కబీరువాణి - 18

- साधो एक रूप सब मांही ।
  अपने मनहि बिचार के देखो और दूसरो नाहिं ।
  एक त्वचा रुधिर पुनि एकै, विप्र सुद्र के माहीं ।
  काहिं नारी काहिं नर होइ बोलै, गैब पुरुष है नाहीं ।
  सबद पुकारि सब मैं भाखै अंतर राख्यो नाहीं ।
  कहे कबीर ज्ञान जेहि निरसल बिरले ताहिं लखाहीं ।।

- *కబీరు చెప్తున్నాడు ...*
  *ఓ సాధూ ...!*
  *బాగా పరికించి చూడు ...!*
  *సర్వుల యందుండెడి అంతః స్వరూపమొక్కటే ...*
  *విప్రుడవనీ ...*
  *శూద్రుడవనీ ...*
  *స్త్రీగానీ ...*
  *పురుషుడుగానీ ...*
  *అందరియందుండు ...*
  *రుధిర మొక్కటే ...*
  *శరీరమూ ఒక్కటే ...*
  *బాహ్య రూప భేదమేగానీ ...*
  *అంతరంగ మొక్కటే ...*
  *శుద్ధ పరిపూర్ణ జ్ఞానులెవరో ...?*
  *వారలే ... ఈ సత్యదర్శనము చేయగలరు ...!!*

## కబీరువాణి - 19

- जा विधि मन को लगावै मन को लगाये प्रभु पावै ।
  जैसा नटनी चढ़त बांस पर नटवा ढोल बजावै ।
  अपना बोझ धरे सिर ऊपर सुरति बरत पर लावै ।
  जैसे भुवंगम चरत बनहिं मनि चेतवै, मनि तजि प्रान गंवावै ।
  जैसे कामिनी भरे कूप जल कर छोड़े बरतावै ।
  अपना रंग सखियन संग रचै, सुरति गगर पर लावै ।
  जैसी सदी चढ़ी सत ऊपर अपनी काया जरावै ।
  मातु पिता सब कुटुमं तियागै, सुरति पिया परलावै ।
  धूप दीप नैवेद अरगजा, ग्यान की आरती लावै ।
  कहै कबीर सुनो भइ साधो फेर जन्म नहिं पावै ॥

- *కబీరు చెప్తున్నాడు ...*
  *నీ మనస్సుని ఎలా సాధనచేస్తే ...*
  *భగవంతుని పొందుతావో తెలుసా...?*
  *వాద్యకారుడు డోలు వాయిస్తుంటే ...*
  *గడసాని నెత్తిన బరువుంచుకొని ...*
  *ఎంత లాఘవంగా ... గడపై కెక్కుతుందో ... అల్లాగ ...,*
  *గడ్డిలో దాగి ఉండి ... పాము ఆహారమైన ప్రాణిని ...*
  *ఎంత ఒడుపుగా గ్రహించగలదో ... అల్లాగ ...,*
  *పడగమీద మణిని ... వదిలి వేసే సమయాన ...*
  *పాము తన ... చూపునూ, ప్రాణాలనూ త్యజిస్తుందే ... అల్లాగ ...,*
  *బావి నీటిని తోడుకొని ... కుండతొణక్కుండా ...తన స్నేహితులతో ...*
  *ఆడుతూ – పాడుతూ కూడా జాగ్రత్తగా తీసికొనివచ్చు ... భామిని వోలె...,*
  *మాతా పితలనూ ..., తన కుటుంబాన్ని త్యజించి ... ప్రేమబంధంచేత*
  *భర్త చితినెక్కి ... సహగమనము చేయు సతి చందాన ... వర్తించవలె ...*
  *ధూప ... దీప ... నైవేద్యములర్పించి గాదు ...?*
  *జ్ఞానమనే హారతి నెవరు అద్దుకుంటారో ...!*
  *వారే జనన మరణ చక్రము నుండి ముక్తి పొందగలరు ...!!*



## కబీరువాణి - 20

- ता थे कहिये लोकाचार ।
  वेद कतेब कथे त्योहार ।
  जरि बरि कर आवै देही,
  मुवा पाछे प्रीत सनेहा ।
  जीवत पित्राही गारी दीन्हा,
  मुवा पित्रेले घालै गंगा ।
  जीवत पित्रकुं अन्न न ख्वावै,
  मुवा पाछे स्पं भरावै ।
  जीवत पित्रकुं बोलै अपराध,
  मुवा पाछे देहि सराध ।
  कहे कबीर मोहि, अचरज आवै,
  कओवा खाइ पित्र क्युं पावै ॥

- *లోకాచార మంటారు ...*
  *కర్మకాండలూ ... వేదవిధులూ నిర్వహిస్తారు ...!*
  *ఎంతో శ్రద్ధాభక్తులతో మృతులైన తమవారి*
  *దహన సంస్కారాలు చేస్తారు ...!*
  *తండ్రిని నిరాదరించి ... మరణించిన పిమ్మట ...*
  *అతని అస్థికలను ఎంతో గౌరవంతో ...*
  *గంగా నిమజ్జనంచేస్తారు ...!*
  *అతనికి సరిగా ఆహార మీయరు గానీ, మరణించిన పిమ్మట ...*
  *ఆతని పేర గోదానమూ ... భూరి దానమూ చేస్తారు ...!*
  *జీవించి ఉన్నపు డతనిని ... కఠిన పదజాలముతో బాధిస్తారు ...!*
  *మరణించినపుడు శ్రాద్ధకర్మలతో ... గౌరవాన్ని నటిస్తారు ...!*
  *కబీరు అంటున్నాడు ... ఇదంతా చూస్తుంటే ...*
  *నాకు చాలా ఆశ్చర్యంగా ఉన్నది ...!*
  *కాకులకో ... కొంగలకో ... పిండం పెడితే ...*
  *స్వర్గాన ఉన్న పితరుని ... కెట్లా చేరేను ...!!*

## కబీరువాణి - 21

 कौन बिचारि करत हो पूजा ?
आतम राय अवर नहिं दूजा ।
बिन प्रतीते पानी तोड़े ग्यान
बिन देवल सिर फोड़े ।
लचरी लपसी आप संवारै,
द्वारे खड़ा राम पुकारे ।
पार आत्मा जो तत विचारै,
कहै कबीर ताके बलिहारै ॥

 *కబీరు చెప్తున్నాడు ....*
*ఏ రూపుడని భగవంతుని కొలుస్తావు ...?*
*పరమాత్ముడు ఆత్మారాముడేగాని మరొకడు గాదు ...*
*ఈ ఎరుకలేని నీవు చేయు యత్నాలు నిష్ఫలమే ...*
*నీటిమీద గీచిన గీటులే ...*
*తల గోడకేసి బాదుకొనుటే ...*
*'రాముడు' ద్వారం చెంత నిలబడి నిన్ను పిలుస్తున్నాడు ...*
*ఇది తెలియని నీవు ఈతిబాధలలో మునిగి ఉన్నావు ...*
*ఈ ఆత్మతత్త్వము నెరిగిన వాడే జ్ఞాని ...*
*అతనికి నా వందనము ...!!*



## కబీరువాణి - 22

 अनगढ़िया देवा कौन करै तेरी सेवा ।
गढ़े देव को सब कोइ पूजै कितही लावै सेवा ।
पूरन ब्रह्म अखंडित स्वामी ताकै न जानै भेवा ।
दस औतार निरंजन कहिये सो अपना न होइ ।
यह तो अपनी करनी भोगै कर्ता और हो कोइ ।
जोगी जती तपी सन्यासी आप आप में लड़िया ।
कहे कबीर सुनो भइ साधो राग लखे सो तरिया ॥

 *కబీరు చెప్తున్నాడు ...*
*ఓ నిరాకారుడా! నిను కొలిచే వారెవరు ...?*
*ఇక్కడ అందరూ విగ్రహాన్ని అర్చించే వారలే ...!*
*నిరాకార పరబ్రహ్మవైన నిన్ను తలచుటయే లేదే ...?*
*దశావతారాలనే నిరంజనుడంటారు ...!*
*కానీ ... అది నిజం గాదు ...!*
*తమ కర్మ ఫలితాలను అనుభవించేవాడు ...*
*భగవంతుడెలా అవుతాడు ...??*
*నిస్సందేహంగా భగవంతుడు వేరే ...!*
*యతులూ ... యోగులూ ...*
*తాపసులూ ... సన్యాసులూ ...*
*వారి వారి సిద్ధాంత రాద్ధాంతాలలో ...*
*మునిగి తేలుతున్నారు ...!*
*ఓ సాధూ! ఎవరు భగవంతుని అమితంగా ప్రేమిస్తారో ...!*
*వారే తరిస్తారు ...!!*

## కబీరువాణి - 23

 अवधू बे गम देस हमारा ।
राजा रंक फकीर बादसा सब से कहे पुकारा ।
जो तुम चाहो परम पद को बसिहो देस हमारा ।
धरनी अकास गगन कछु नाहीं नाहीं चंद्र नाहीं तारा ।
सत धर्म काहै महतावे साहेब के दरबारा ।
जो तुम आये झीनै झोके तजो मनकी भारा ।
कहे कबीर सुनो हो प्यारे सत धर्म है सारा ।।

 *కబీరు చెప్తున్నాడు ... ఓ ప్రియ అవధూతా!*
*కష్టాలూ, కల్మషాలు లేనిది నే నుండే దేశం ...*
*అచట...*
*రాజూ-పేద ...,*
*సన్యాసీ-మహారాజు ... అందరికీ ఆహ్వానం ...*
*మీరందరికీ కూడా ఎలుగెత్తి చెప్తున్నాను ...*
*ముక్తిపదము గోరినవారందరూ ...*
*మా దేశాన వసించరండి ...*
*అచట భూమ్యాకాశాలు ...*
*చంద్రతారకలూ ఉండవు ...*
*సర్వోన్నతుడైన ఆ ప్రభువు దర్బారులో*
*సత్య ధర్మములు వెలుగొందుతాయి ...*
*అచట కేతెంచితివో ...*
*నీ కష్టాలూ-కన్నీళ్ళు ... బరువులూ-బాధలూ ...*
*వదలిపోతాయి ...!!*



## కబీరువాణి - 24

 कौन मुरली सबद सुन आनंद भयो ।
जोत बरै बिन बाती ।
बिन मूल के कमल प्रगट भयो
फुलवा फुलत भांती भांती ।
जैसे चंद्रमा चकोर चितवै
जैसे चातक स्वांती ।
तैसे संत सुरत के हो कै
हो गये जनम संघाती ।।

 *ఆహా! ఎంత మధురమీ మురళీనాదం ...*
*ఏమి ఈ ఆనందపరవశం ...!*
*వత్తిలేకుండానే ...*
*దీపాలు ప్రకాశిస్తున్నాయి ...!*
*మూలము లేకుండగనే ...*
*పద్మములు వెల్లివిరుస్తున్నాయి ...!*
*ఎన్నెన్ని రంగుల పూలు ...*
*ఎంత గుబాళిస్తున్నాయి ...!*
*చంద్రునికై ...*
*చకోరం ఎదురుచూస్తున్నది ...*
*స్వాతిచినుకుకై ...*
*చాతకం వేచియున్నది ...*
*ఆ స్వామిపై అంత గాఢానురక్తే ఉంటే ...*
*ఆతండు నీ వాడౌను గదా ...!!*

## కబీరువాణీ - 25

- गुरु बिन कौन बतावै बाट
  बड़ विकट जेम घाट ।
  भ्रांति की पहाड़ी नदिया बीच में
  अहंकार की लाट ।
  मद मत्सर का मेहा बरसत
  माया पवन बहै दाट ।
  कहत कबीर सुनो भाइ साधो
  क्यों तरना यह घाट ॥

- *అయ్యో! నీవున్నదెంత కష్టభూయిష్టమైన స్థితి ...?*
  *దారిచూపి రక్షించు వారెవరున్నారు ...?*
  *ఒక్క సద్గురువు తప్ప ...!*
  *నీవున్నది కష్టాల కడలి ...*
  *పైగా అహంకారపు సుడిగుండంలో చిక్కుకున్నావు ...*
  *అచ్చట మదమాత్సర్య మేఘాలు వర్షిస్తున్నాయి ...*
  *మాయామోహాల హోరుగాలులు వీస్తున్నాయి ...*
  *మార్గాన్ని అంధకారబంధురం చేస్తున్నాయి ...*
  *అయ్యో! సాధూ! నీకెంత దుర్భరము ...!*
  *నీవు ఈ గట్టునెట్లా దాటగలవు ...?*
  *ఆ గట్టునెలా చేరుతావు ...??*



## కబీరువాణీ - 26

- माया महा ठगिनी हम जानी ।
  तिरगुन फांस लिए कर डोलै बोलै मधुर बानी ।
  केसव के कमला है बैठी, सिव के भवन भवानी ।
  पंडा के मूरत है बैठी, तीरथ में भइ पानी ।
  जोगी के जोगिन है बैठी, राजा के घर रानी ।
  काहू का घर हीरा है बैठी, काहू के कौड़ी कानी ।
  भगवन के भगवती है बैठी, ब्रह्मा के ब्रह्मानी ।
  कहे कबीर सुनो हो संतो, यह सब अकथ कहानी ॥

- *కబీరు చెప్తున్నాడు ....!*
  *ఈ మాయామోహములెంత మోసకారులో నాకు తెలుసు ...*
  *త్రిగుణములైన ముప్పేట ఉరితాడు చేబూని తిరుగుతుంటాయి ...*
  *తియ్య తీయని మాటలతో ... చేర రమ్మంటాయి ...*
  *విష్ణువు వైకుంఠంలో లక్ష్మీదేవి ...,*
  *శివుని కైలాసంలో భవానీ ...,*
  *అర్చకుదర్చించే విగ్రహమూర్తీ ...,*
  *తీర్థక్షేత్రాల్లోని పుణ్యనదులూ ...,*
  *యోగిచెంత నుండే యోగినీ ...,*
  *రాజు ఇంట రాణీ ...,*
  *ఒకరి ఇంట మణిమాణిక్యం ...,*
  *మరొకరి ఇంట కనకపురాసీ ...,*
  *దేవుని చెంత దేవేరీ ...,*
  *కమలాసనుని చెంత సరస్వతీ ...*
  *ఇవి అన్నీ అంతే ... ఓ సాధూ! ఇవి అన్నీ కట్టుకథలే ...!!*

## కబీరువాణి - 27

- रूप रेख जेहि है नहीं, अधर धरे नहिं देह ।
  गगन मंडल के मध्ये रहता पुरुष बिदेह ।
  सांइ मेरा एक तूं और न दूजा कोइ ।
  जो साहब दूजा कहे दूजा कुलका होइ ।
  सगुन का सेवा करों, निर्गुन का करूं ज्ञान ।
  निर्गुन सगुन के परे तहें हमारा ध्यान ॥

- *రంగురూపములులేని నా స్వామికి దేహమెట్లుండు ...?*
  *గగన (శూన్య) మండల మధ్యమున ఆ నిరాకారుడుండు ...*
  *ఆతడే పరమాత్మ ...!*
  *మరియొకండు లేడు ...!!*
  *ఆత దద్వైతుడు ...!*
  *ఆతని ద్వైతుడన్నవాడు ...!*
  *పరమాత్మ నెరుగనివాడు ...!!*
  *నేనా నిర్గుణుని ఎరిగినవాడను ...!*
  *సగుణుని పూజించేవాడను ...!*
  *సగుణ నిర్గుణ భేదముల కతీతము నా ధ్యానము ...!!*



## కబీరువాణి - 28

- क्या मागूं कछु थिर न रहाइ ।
  देखत नयन जल्या जग जाइ ।
  इक लख पूत सवा लख नाती
  ता रावन धरि दिवा न बाती ।
  लंका सो कोट समद सी खाइ,
  ता रावन का खबर न पाइ ।
  आवत संग न जावत संगाती,
  कहा भयो दरि बांधे हाथी ।
  कहे कबीर अंत की बारी हाथ झाडि
  जैसे चले जुवारी ॥

- *నేను ఆ భగవంతుని ఏ వరమడగాలి ....??*
  *తోచటం లేదు....*
  *నా కనుల ముందే ...*
  *ఈ జగమంతా అనిత్యమై కదలిపోతున్నది ....!*
  *జలధి పరివేష్ఠితయై, అజేయమైన లంకా రాజ్యంలో ....*
  *లక్షపుత్రులూ, లక్షలమంది మనుమలతో అలరారిన రావణునికీ ....*
  *చివరికి మిగిలిందేమిటి?*
  *పలుకరించే దిక్కే మిగులలేదే...??*
  *ఇహ లోకంలోకి ఒంటరిగా వచ్చావు....*
  *తిరిగి ఒంటరిగానే వెళ్ళాలి ....*
  *మరి పెను ఆశతో నీ వాకిట*
  *ఏనుగు నెందుకు బంధించావు?*
  *తన సర్వస్వాన్ని జూదంలో కోల్పోయిన జూదరి లాగా ....*
  *రిక్తహస్తాలతో నీవు ...*
  *ఈ లోకం లోంచి వెళ్ళిపోవాలి .... తెలుసుకో ...!!*

## కబీరువాణి - 29

- मैं जन भूला तूं समझाइ ।
  चित चंचल रहै न अटक्यो बिषै वन कूं जाइ ।
  संसार सागर माहि भूल्यो थक्यो करत उपाइ ।
  मोहनी माया बांधनी थे राखिले राम राइ ।
  गोपाल सुनि एक बिनती सुमति तन ठहराइ ।
  कर कबीर यह काम रिपु है मारे सबकुं ढाइ ॥

- *ఓ రామా!*
  *దారి మరచిన నాకు ...*
  *దారి చూపించు వాడవు నీవే ...*
  *విషయవాసనలతో నిండిన ఈ జనారణ్యంలో*
  *నా మనసు చంచలమై ...*
  *చిక్కుకు పోయింది ...!*
  *ఈ సంసారసాగరంలో మునిగి ...*
  *అలసిపోతున్నది ...*
  *మాయామోహముల బారి పడుతూ ఉన్నది ...*
  *నన్ను బ్రోచెడి వాడివి నీవే !*
  *ఓ రామా !*
  *నా మొఱాలకించు ...!*
  *నను బాధించే కామక్రోధములనే*
  *శత్రువులను నీ బాణముచే గూల్చవా ...!!*



## కబీరువాణి - 30

- अब तुम कब सुमिरोगे राम ।
  जीवडा दो दिन का मेहमान ।
  गरभवास में हाथ जुडाया निकल गया बेईमान ।
  बालापन खेले गंवाया तरुन भयो मन काम सताया ।
  बूढेपन तन कांपन लागा निकल गया अवसान ।
  झूठी काया झूठी माया आखर मोथ निदान ।
  कहत कबीर सुनो भइ साधो दो दिन का मेहमान ॥

- *ఓ సాధూ! విను ... రెణ్ణాళ్ళ అతిథివై ఈ లోకానికొచ్చావు ...!*
  *తిరిగి వెళ్ళక తప్పదు ... ఈ మాట మరిచావు ...!*
  *నీ తలపుల ఆ రాముని నిలుపవుగా ...!*
  *అమ్మగర్భాన ఉన్నపుడు ముకుళిత హస్తుడవై ...*
  *ఆ దేవదేవుని ప్రార్థించావు ...!!*
  *ఈ లోకానపడగానే ఆ మాటే మరిచావు ...*
  *ఇది అంతా నిత్యమనుకున్నావు ...*
  *నీ బాల్యమంతా ఆటపాటలతో గడచిపోయింది ...*
  *జవ్వనాన ... కామవాసనలు చుట్టుముట్టాయి ...*
  *ముసలితనాన జరాపీడితుడవయ్యావు ... అవసాన కాలం దాపురించింది ...*
  *అప్పుడు నిన్నావరించిన ఈ మాయ మాయమవుతుంది ...*
  *ఈ శరీరం అనిత్యమనే సత్యం అవగతమవుతుంది ...*
  *కానీ అప్పటికే మృత్యువు నిన్ను చుట్టుకుంటుంది ...*
  *అందుకే విను ... ఈ నేల మీద రెణ్ణాళ్ళుండి పోయేవాడివే ...*
  *అది తెలుసుకు మసలుకో ...!!*

## కబీరువాణి - 31

हरि हिरदेरे अनत कत चाहौ ।
भूले भरम दूनी कत बाहौ ।
जग परबोध होत नर खाली कर ते उदर उपाया ।
आतम राम न चीन्हे संतो क्यूं रमिले राम राया ।
लोग प्यास नीर सो पीवे बिन लागे नहिं पीवे ।
खोजे तत मिलै अविनासी बिन खोजै नाहिं पावै ।
कहो कबीर कठिन यह करनी जैसी संडैधारा ।
उलटी जाल मिलै परब्रह्म को सो सतगुरु हमारा ॥

*కబీరు అంటున్నాడు....*
*హరి ఉన్నది ... నీ మదియందే ...!*
*ఇది తెలియని నీవు అందందు వెతుకుతున్నావు ...*
*కొఱగాని జీవనపోరాటం సలుపుతున్నావు ...*
*నీ మదినున్న నిత్యరూపుని గానకపోతివి ...?*
*ఈ మాత్ర మెరుకలేని నీవు రాముని బాయగలవా ...??*
*దప్పిగొన్నవాడే గదా నీటిజాలు నెతికేది ...!*
*దాహమే లేనివానికి నీరము లెందుకు ...?*
*ఆ సర్వాత్ముని ఆర్తితో వెదుకుదువా ...*
*మరు నిముషాన నీ యందుండు కదా ...!*
*ఆ యత్నం అసిధారావ్రతమే ...! బహుకష్ట సాధ్యమే ...!!*
*అయితేనేం ...?*
*నేను సద్గురువు కృపకు పాత్రుడనయ్యాను ...*
*అతను చూపిన మార్గాన ...*
*పరమాత్ముని చేరగలిగాను ...!!*



## కబీరువాణి - 32

भलै निदौ भलै निदौ भलै निदौ लोग ।
तन मन सब पियारे जोग ।
मैं बौरी मेरे राम भरतार
ता कारनि रचि करे सिंगार ।
जैसे धुबिया रज मल धोवै
हर तप रत सब न्यंदक खोवै
न्यंदक मेरे माइ बाप ।
जन्म जन्म के काटे पाप ।
न्यंदक मेरे प्रान अधार
बिन बेगारि चलावै भार ।
कहे कबीर न्यंदक बलिहारी
आप रहे जन पार उतारी ॥

*నను దూషించే దూషణలు ...*
*నాకు శ్రేయోదాయకములు ...!*
*నను దూషణచేయు వారు ...*
*నా శ్రేయోభిలాషులు ...!*
*వీరివల్లనే నేను త్రికరణ శుద్ధిగా నా రాముని సేవించగల్గుతున్నా ...*
*నా రాముని ప్రేమలో మునిగి నే పూర్తిగా పిచ్చివాడనయ్యాను ...*
*నా ఈ దేహాలంకరణలన్నీ ఆతని రంజింపచేయుట కొఱకే ...*
*వస్త్రాల మురికిని చాకలి వదిలించినట్లు ...*
*నా విమర్శకుడి దూషణలతో నా తపవ్రతములు చక్కదిద్దుకున్నాను ...*
*అంచేత ఆతడు నా తల్లిదండ్రులకన్న మిన్నయైన వాడు ...*
*మునుపటి జన్మాంతరాలనుండి నేనార్జించిన పాపాలను చక్కదిద్దుతున్నారు ...*
*ఎంత మేలు చేస్తున్నారు ...*
*నా బరువులన్నీ వారే మోస్తున్నారు ...!*
*స్వయంగా పాపాలలో కూరుకుపోతూ ...*
*ప్రక్కవారి నుద్ధరించే ఆ దూషకులకు ఇవే నా ప్రణామములు ...!!*

## కబీరువాణీ - 33

- नाहीं धर्मी नाहीं अधर्मी ना मैं जती न कामी हों ।
  ना मैं कहता ना मैं सुनता ना मैं सेवक स्वामी हों ।
  ना मैं बंधा ना मैं मुकता ना मैं बिरत ना रंगी हों ।
  ना काहू से न्यारा हुआ ना काहू से संगी हों ।
  ना हम नरक लोक को जाते ना हम स्वर्ग सिधारे हों ।
  सब ही कर्म हमारा कीया हम करमन ते न्यारा हों ।
  सब ही कर्म हमारा कीया हम करसन ते न्यारा हों ।
  जा मत कोइ बिरले बूझे जो अटल हो बैठे हो ।
  ना कबीर काहू को थापे ना काहू के मेटे हो ।।

- *నే నేదో ఒక మతానికి చెందినవాడను గాను ...!*
  *అలాగని మతంలేనివాణ్ణీ కాదు ...!*
  *సాధువునూ గాదు ... లౌకికుడనూ గాదు ...!*
  *నేనేమీ చెప్పను ... ఎవరిదీ వినను ...!*
  *సేవకుడనూ గాను ... స్వామినీ గాను ...!*
  *బందీనీ కాదు ... స్వతంత్రుడినీ కాదు ...!*
  *విరాగినీ కాదు ... కాముకుడనూ గాదు ...!*
  *నా కెవరితో స్నేహమూ లేదు ...!*
  *ప్రేమ బంధమూ లేదు ...!!*
  *నే స్వర్గానికీ వెళ్ళను ...!*
  *నరకానికీ వెళ్ళను ...!!*
  *నేను చేయు కర్మలకు ... నాదే జవాబుదారీ ...!*
  *సత్కర్మ ద్వారా 'అతని' కి చేరువయ్యాను ...*
  *కానీ, ఈ కబీరు ఏదీ సృజియించేవాడు గాదు ...!*
  *వినాశకారీ గాదు ...!!*



## కబీరువాణీ - 34

- जहंवा से आयो अमर वह देशवा ।
  पवन पानी धरती आकाशवा
  चांद न सूर न रैन दिवसवा ।
  ब्राह्मन छत्री न सुद बैसवा,
  मुगल पठान न सयद सेखवा ।
  आदि जोत नहिं गौर मनोसवा
  ब्रह्मा बिस्तु महेश न सेसवा ।
  जोगी न जंगम मुनि दखेसवा
  आदि न अंत न काल कलेसवा ।
  दास कबीर ले आये संदेसवा
  सार सबद गहि चलो वा देसवा ।।

- *కబీరు చెప్తున్నాడు ...*
  *నీవు ఎచ్చటి నుండి వచ్చావో ...*
  *ఆ రాజ్యం శాశ్వతమైనది ...*
  *అచట అనిలమూ – అనలములుండవు ...*
  *భూమ్యాకాశాలుండవు ... సూర్యచంద్రులుండరు ...*
  *చీకటి వెలుగులూ ... రేయిపవలూ ఉండవు ...*
  *బ్రాహ్మణ క్షత్రియులూ ... శూద్రవైశ్యులూ ఉండరూ ...*
  *మొఘలు పఠానులూ, షేక్ సయ్యద్‌లూ ఉండరు ...*
  *ఆది జ్యోతి ఉండదు ... గౌరీ గణేశులుండరు ...*
  *బ్రహ్మవిష్ణుమహేశ్వరులూ ... ఆదిశేషువూ లేరు ...*
  *యోగులూ, సన్యాసులూ, మునులూ ఉండరు ...*
  *అచట ఆద్యంతములు లేవు ... కాలమూ, క్లేశమూ ఉండవు ...*
  *నేను ... కబీరుదాసును ...*
  *ఈ సత్యసందేశాన్ని మోసుకొచ్చాను ...!*
  *నిజసారము నెరిగి ... ఆ రాజ్యానికి తరలి పొండి ...!!*

# కబీరువాణి - 35

- भक्ति का मारग झीना ।
  कोई जाने जाननहार संत जन जो पर बिना रे ।
  नहिं अचाह चाह कछु उर में, मन लौलीना रे ।
  साधुन की संगति में निस दिन रहता लीना रे ।
  सबद में सुरति बसै इमि जैसे जल बिच मीना रे ।
  जल बिछुरत ततकाल होत जिमि कमल मीलना रे ।
  धन कुल का मान त्याग करे रहे अधीना रे ।
  परमारथ के हेत देत सिर बिलम ना कीना रे ।
  धारन करि संतोस सदा अमृत रस पीना रे ।
  भक्त की रहनि कबीर सकल परगठ कर दीना रे ॥

- *కబీరు చెప్తున్నాడు ....*
  *భక్తిమార్గము బహుక్లిష్టతరము ...!*
  *జ్ఞానులూ ... సజ్జనులు మాత్రమే అది తెలియగలరు ...!*
  *ఆ భక్తుని హృదయం కోరికల కతీతమై ...*
  *పరమాత్మయందు తల్లీనమై ...*
  *నిత్యమూ సజ్జన సాంగత్యంలో గడుపుతాడు ...!!*
  *చేప నీటియందుండు చందాన ...*
  *భగవంతుడు నామస్మరణయందుంటాడు ...!*
  *నీటి నుండి వేరుపడ్డ పద్మం ఎలా వడలిపోతుందో ...*
  *పరమాత్మను బాయని భక్తుడు ... అలా అలమటిస్తుంటాడు ...!!*
  *ధన, కుల గర్వములను త్యజించిన అతడు ...*
  *పరహితార్థము ఇంచుక సంశయించక ...*
  *తన తలనైనా ఇచ్చేందుకు సంసిద్ధుడవుతాడు ...!!*
  *ఆతడు నిత్య సంతృప్తుడు ... అమృత రసాస్వాది ...*
  *సద్భక్తుని గుణగణాదులివి ... విధి విధానము లిట్టివి ...!!*



# కబీరువాణి - 36

- लोग मति का भोरा रे ।
  जो कासी तन तजे कबीरा रामहि कहा निहोरा रे ।
  तब हम वैसे अब हम ऐसे इहै जग का लाहा रे ।
  राम भगति पर जाके हित चित ताकी अचरज काहा रे ।
  गुरु परसाद साध की संगति जन जीते जाइ जुलाहा रे ।
  कहे कबीर सुनहुरे संतो भ्रमि परे जनि कोइ रे ।
  जस कासी तस मगहर ऊसर हिरदे राम सति होइ रे ॥

- *కబీరు చెప్తున్నాడు ....*
  *మనిషిని తన మనసే తప్పుత్రోవ పట్టిస్తుంది ...*
  *కాశీలో దేహత్యాగం – మోక్షప్రాప్తం అనుకుంటారే కానీ ...*
  *ఆ రాముని తేరి చూడరుగా ...!!*
  *అప్పుడలా ఉన్నాను ... ఇప్పుడిలా ఉన్నాను ... అంటూ*
  *బేరీజు వేసికుంటూ తిరుగుతారు ...!*
  *రామభక్తిన తల్లీనుడైన వానికి ... ఈ భావావేశాలుండవుగా ...!!*
  *గురు అనుగ్రహంచేత ...*
  *సజ్జన సాంగత్యము పొందిన ... ఈ కబీరు*
  *ఈ లౌకిక భావనల జయించగలిగాడు ...!!*
  *ఓ సాధూ ...! విను!*
  *మనసుచేయు మాయలను తెలుసుకో ...!*
  *ఆ రాముని మదిలో నెంచినవారికి*
  *కాశీయైనా ... మగ్‌హర్ అయిన ఒక్కటే ...!*
  *(మగ్‌హర్‌లో చనిపోతే నరకానికి వెళతారన్న ప్రచారం ఉన్నది.)*

## కబీరువాణి - 37

 रे मन क्यूं भूला रे भाइ ।
सपन में राजा राज करत है हाकिम हुकुम दुहाइ ।
भोर भइ जन लावन लस्कर आंख खुली सुधि लाइ ।
पंछी आन बृछ पर बैठे रिलमिल चोह्लर गाइ ।
भोर भइ जब आप आपने जहां तहां उठ जाइ ।
भाइ बंधु अरु कुटुम कबीला नाता सगा सगाइ ।
सागर एक लहर बहुउपजै गिनती गिनी न जाइ ।
कहे कबीर सुनो भइ साधो उलटी लहर समाइ ॥

 *కబీరు చెప్తున్నాడు ...*
*ఓ మనసా! ఇంత మఱపెందుకు ...?*
*రాత్రి కలలో నీవు ఒకరాజువై రాజ్యాన్ని ఏలుతావు ...*
*ఒక అధికారిలాగా అధికారం చెలాయిస్తావు ...*
*తెల్లవారింది ...!*
*కళ్ళు తెరచుకున్నావు ...!*
*స్పృహలో కొచ్చావు ...!*
*జనాలూ ... సైనికులూ ... అంగరక్షకులూ ... అంతామాయం ...!*
*చెట్టుకొమ్మన కూర్చున్న పక్షి కుహుకుహూరవం వినిపించింది ...!*
*తెల్లవారగానే నిద్రలేచి కార్యమగ్నులై వెళ్ళిన*
*బంధుమిత్రులూ ... ఇరుగుపొరుగులూ ...*
*మళ్ళీ చివరికి ...*
*తమ గమ్యస్థానం (పరమాత్మని) చేరవలసిందే ...*
*అనంతములై పడిలేచిన ఆ అలలన్నీ ...*
*చివరకి సముద్రంలోనేగా చేరుతున్నాయి ...!!*



## కబీరువాణి - 38

 सदगुरु सोइ दया करि दीन्हा ।
ताते अन चीन्हार मैं चीन्हा ।
बिन पग चलना बिन पख उड़ना बिन चूंच का चूमना ।
बिन नैन का देखन पेखन बिन सरबन का सुनना ।
चान न सूर दिवस नहिं रजनी तहा सुरत लौ लाइ ।
बिना अन्न अमृत रस भोजन, बिन जल तृष्णा बुझाइ ।
जहँ हरस तंह पूरन सुख है, यह सुख कांसो कहना ।
कहे कबीर बलबल सत गुरुका धन सिसका लहना ॥

 *నా గురువెంతో దయాళుడు ...*
*వారివల్లే నేను అగమ్యుని చేరగలిగాను ...!*
*అతడు కాళ్ళులేకున్నా ... నడువగలడు ...!*
*రెక్కలు లేకుండా ... ఎగురగలడు ...!*
*పెదవులు లేకనే ... మాటలాడగలడు ...*
*కనులు లేకుండగనే ... చూడగలడు ...*
*చెవులు లేకుండగనే ... వినగలడు ...*
*అచ్చట సూర్యుని పగళ్ళు ...,*
*చంద్రుని రాత్రులూ ఉండవు ...!!*
*అచ్చట అన్నపానాదులుండవు ...,*
*అమృతరసమే ఆహారం ...!!*
*నీరుద్రాగకనే దప్పిక తీరు ..., ఇంకా ఏమి చెప్పను ...??*
*అక్కడున్నదంతా సంతోషమే ...,*
*పూర్ణసుఖమే ..., వర్ణనాతీతమే ...*
*ఇదంతా సద్గురువు దయవల్లే నాకు సంప్రాప్తించింది ...!!*

## కబీరువాణి - 39

नाचू रे मेरे मन मत होय ।
प्रेम के राग बजाय रैन दिन सबद सुने सब कोय ।
राहु केतु नवग्रह नाचे जन्म जन्म आनंद होय ।
गिरि समंदर धरती नाचे, लोग नाचे हंस रोय ।
छापा तिलक लगाय बांस चढ़ हो रहा सबसे न्यारा ।
सहस कला कर मन मोरा नाचे रीझै सिरजनहारा ॥

*కబీరు అంటున్నాడు ....*
*ఓ మనసా! అనురాగమనే రాగం పలికిస్తూ ...*
*మైమరచి నృత్యం చేయి ...*
*దివారాత్రాలూ ... సకల జనులూ వినేలా ...*
*జన్మ జన్మాంతరాల ఆనందాలు ఉబికి వస్తున్నాయి ...!*
*రాహుకేతువులూ ... నవగ్రహాలూ నాట్యం చేస్తున్నాయి ...!*
*గిరులూ-తరులూ, జలమూ-థలమూ సర్వం నర్తిస్తున్నాయి ...!*
*ప్రజలూ మైమరచి నృత్యం చేస్తున్నారు ...*
*ఆనందబాష్పాలు జల్లు లౌతున్నాయి ...!*
*కానీ అక్కడున్నాడే ...*
*అతడు మాత్రం వైష్ణవ ముద్రలు ధరించి ...,*
*తిలకధారణ చేసి ..., వేణువు నూదుకుంటున్నాడే ... పాపం ...*
*తన్ను తాను అందరికంటే భిన్నుడను అనుకుంటున్నాడు ...!*
*నా మనసుమాత్రం తల్లీనమై ... ఆనంద నర్తనం చేయాలి ...!*
*ఆ దయామయుడు అది చూసి మెచ్చుకోవాలి ...!!*



## కబీరువాణి - 40

जन की पीर हो राजा राम भल जानै ।
कहुकाहु कोम मानै ।
नन का दुख बैन जाने, बैन का दुख स्त्रबना ।
प्यंड का दुख प्राना जानै, प्रान का दुख मरना ।
आस का दुख प्यासा जानै प्यासा दुख नीर ।
भगत का दुख राम जानै कहे दास कबीर ॥

*కబీరు అంటున్నాడు ....*
*భక్తుల కష్టాలు ఆ రాముడెఱుగు ...!*
*వేరెందు నివేదించనేల ...??*
*కళ్లలోని బాధ మాట కెఱుక ...!*
*మాటలోని బాధ చెవుల కెఱుకే ...!!*
*ఈ బొందిలోని బాధ ప్రాణాని కెఱుక ...!*
*ఈ జీవుని వెతలు మృత్యువు కెఱుక ...!!*
*ఆశల దుఃఖము దాహాని కెఱుక ...!*
*దాహపు దుఃఖము నీరము కెఱుకే ...!!*
*భక్తుల దుఃఖము నా రాముని కెఱుకే ...*
*ఇది నిక్కము ...!!*

## కబీరువాణి - 41

रहना नहिं देस बिराना है ।
यह संसार कागद की पुड़िया
बूंद पड़े घुल जाना है ।
यह संसार कांट की बाड़ी
उरझि पुरझि मर जाना है ।
यह संसार झाड़ और
झांखर आग लगे जरि जाना है ।
कहत कबीर सुनो भई साधो
सतगुरु नाम ठिकाना है ॥

*కబీరు చెప్తున్నాడు ...*
*ఈ ప్రదేశం బంజరుభూమి ...!*
*వాసయోగ్యం కాదు ...!!*
*ఈ జగత్తు కాగితపు పొట్లం ...!*
*నీటిచుక్క తడితగిలిందా ... చివికి పోతుంది ...!!*
*ఈ ప్రపంచం ఒక ముళ్ళతోట ...!*
*మనం ఇక్కడే వాడి వాలి పోతాము ...!!*
*అగ్ని శిఖలు చుట్టుముట్టి ...*
*మాడి సర్వం బూడిదవుతుంది ...!!*
*ఓ సాధూ! విను ...!*
*నిక్కమై నిలచి ఉండేది ...*
*సద్గురు నామమొక్కటే ...!!*



## కబీరువాణి - 42

तज दिये प्राण कायारे कैसी रोइ ।
चल प्राण काया कैसे रोइ .....
मैं जाना मेरे संग चलेगा यहि ते ....
ऊंचे नीचे महल छोड़ गया, भैस घर छोडी ।
तिरिया जो कुलवंती छोड़ी और पुतरन की जोड़ी ।
मोटी छोटी गजी मंगाइ गढ़ी काट की घोड़ी ।
चार जन तोय ले के चलै फूंक दइ रे फागन की सी होली ।
भोली तिरिया रोवन लागी बिछड गई मेरी जोड़ी ।
कहत कबीर सुनो भाइ साधो जिन जोडी तिन तोड़ी ॥

*ప్రాణము వదలిన శరీరం ఇలా దుఃఖిస్తున్నది ...*
*హృదయంలేని జీవుడు ... నన్నిలా వదిలేసి వెళ్ళిపోయాడు ...!*
*కూడా వెళ్తాననుకుని ... రుద్ది రుద్ది శుభ్రపరచుకు తయారయ్యాను ...*
*ఇంకా ఇల్లూ-వాకిలీ, గొడ్డూ-గోదా, భార్యా-బిడ్డలూ ...*
*ఇలా అందరినీ ... అంతటినీ ... వదిలేసి వెళ్ళిపోయాడు ...!*
*కట్టెల సవారీ మీద వేసికొని ...*
*నలుగురు బలాఢ్యులు తీసికెళ్ళారు ...!*
*ఫల్గుణ మాసాన వచ్చే హోలీలాగా ...*
*ఈ కాయాన్ని దహనం చేస్తారు ...!*
*అమాయకురాలైన భార్య రోదిస్తున్నది ...*
*'అయ్యో! నా తోడు వీడెనే' అని ...!*
*కబీరు అంటున్నాడు ....*
*ఓ సాధూ! విను ...!*
*ఒకనాడు ఈ జంట కలిపినవాడే ...,*
*నేడు ఎడబాటు చేసాడు ...!!*

## కబీరువాణి - 43

हरि बिन कौन सहाइ मन का ।<br>
माता पिता भाइ सुत बनिता हित लाग्यो सब फनका ।<br>
आग को कछु पुलिहा बांधो क्या घर आसा धनका ।<br>
कहां बिसासा इस भालेका इतनत लागे थनका ।<br>
सकल धरम पुन फल पावोगे धुरवाखो सव जनका ।<br>
कहे कबीर सुनहुरे संतो इहंमन उङुन संक्षेपु बनका ॥

*కబీరు చెప్తున్నాడు ....<br>
ఆ హరి తప్ప శరణాగతి ఎవ్వరు ...?<br>
మాతా-పితలు ..., భార్యా-బిడ్డలు ..., సోదరీ - సోదరులు ...<br>
అందరూ ... ఎవరి జీవనపోరాటంలో వారున్నారు ...!<br>
ఈ ఇంటి మీదో ... సంపాదించిన ధనం మీదో ...<br>
ఆశ పెట్టుకోకు ... అది నిన్నుద్ధరించదు ...!<br>
అదృష్టాన్ని నమ్ముకోకు ...<br>
కొంచెం పుణ్యంమాత్రం మూటగట్టుకో ...!!<br>
చేసిన ధర్మానికి ... పుణ్యఫలాన్ని మాత్రం పొందుతావు ...!<br>
ఓ సాధు! విను ...!<br>
ఈ మహారణ్యంలో మనిషి ఒక చిన్న పిట్ట ...!<br>
అతని ఉనికి అత్యల్పం ... అశాశ్వతం ...!!*



## కబీరువాణి - 44

संतो सो निज देस हमारा ।<br>
जहां जाय फिर हंस न आवे भवसागर की धारा ।<br>
सूर चंद नहिं तंह प्रकासत नहिं नभ मंडल तारा ।<br>
उदय न अस्त दिवस नहिं रजनी बिन ज्योति उजियारा ।<br>
पांच तत्व तीन गुण तंह नाहिं नाहिं तंह सृष्टि पसारा ।<br>
क्षुधा तृष्णा नहिं सीत उष्ण तंह सुख दुख को संचारा ।<br>
आधि न व्याधि उपाधि कछु नाहिं पाप पुण्य बिस्तारा ।<br>
ऊंच नीच कुल की मरयादा आस्त्रम वर्ण विचारा ।<br>
धर्म अधर्म तंह किछु नाहिं संजम नियम आचारा ।<br>
अति अभिराम धाम सर्वोपर सोभा जासु अपारा ।<br>
कहे कबीर सुनो भाइ साधो तीन लोक से न्यारा ॥

*కబీరు చెప్తున్నాడు ....<br>
ఓ సాధు జనులారా ...! నా స్వదేశం గురించి చెప్తున్నాను వినుడు ...!<br>
ఒకసారి అక్కడికి చేరుకున్నామా ..., మళ్ళీ ఈ భవసాగరాన చిక్కుకోము ...!<br>
అచ్చట సూర్యచంద్రులూ ..., ఆకాశం-మెరిసే నక్షత్రాలూ ఉండవు ...<br>
ఉదయాస్తమయాలూ ... దివారాత్రములూ ఉండవు ...!<br>
జ్యోతి లేకుండగనే ప్రకాశం పరుచుకుని ఉంటుంది ...!<br>
ఈ సృష్టి నావరించిన పంచతత్త్వాలకూ, త్రిగుణాలకూ అతీతమైనది ...!<br>
అచ్చట మాయలూ - మోసాలూ, సంసారాలూ - బంధుత్వాలూ ఉండవు ...!<br>
ఆకలిదప్పులుండవు - శీతోష్ణాలుండవు - సుఖదుఃఖములసలే ఉండవు ...!<br>
రోగాలూ - రొష్టులూ..., జీవనపోరాటాలూ..., పాపపుణ్యాలూ ఉండవు ...!<br>
కులధర్మాలూ ..., వర్ణాశ్రమధర్మాలూ ..., హెచ్చుతగ్గులూ ఉండవు ...!<br>
ధర్మాధర్మాలూ, సంయమ నియమాలూ, ఆచార వ్యవహారాలూ ఉండవు ...!<br>
అచ్చోటు ముల్లోకలములకన్న బహు విలక్షణము ...!<br>
ఆ ఆరామ మతియానందకరము ... అత్యంత మనోజ్ఞము ...!!*

## కబీరువాణి - 45

 मन फूला फूला फिरे जगत में कैसा नाता रे।
माता कहे यह पुत्र हमारा बहन कहे बीरा मेरा रे।
कहे भाइ यह भुजा हमारी, नारी कहे नर मेरा रे।
पेट पकरि कर माता रोवै, बांह पकरि कै भाई रे।
लपटि झपटि कै तिरिया रोवै, हंस अकेला जाइ रे।
जब तक जीवे माता रोवै, भाइ रोवै दस मासा रे।
तेरा दिन तर तिरिया रौवै फिर करै घर बासा रे।
कहे कबीर सुनो भाइ साधो छोंडो जग की आसा रे।

 *ఓ మనసా.... తెగ తుళ్ళిపడుతున్నావు....!*
*ఇలా తిరుగుతూ ఉన్నావు....!!*
*తల్లి... వీడు నా కొడుకంటుంది....!*
*సోదరి... నా అన్న-తమ్ముడంటుంది....!*
*సోదరుడు నా తోడబుట్టినవాడంటాడు....!*
*భార్య నా వాడంటుంది...!*
*నేను చనిపోయినపుడు... నన్ను పట్టుకుని నా తల్లి రోదిస్తుంది....!*
*చేతులు పట్టుకుని సోదరుడేడుస్తాడు...!*
*భార్య పొర్లి పొర్లి ఏడుస్తుంది....!*
*కానీ ఈ పిట్ట (ప్రాణం) మాత్రం ...*
*ఒంటరిగానే ఎగిరిపోతుంది....!!*
*తల్లి తానున్నంత వరకేడుస్తుంది...*
*సోదరుడు పదిమాసాలేడుస్తాడు....*
*భార్య పదమూడు రోజులేడ్చి ... ఇల్లు దిద్దుకోవటంలో మునిగిపోతుంది....*
*ఇలాంటి ఈ జగత్తు కోసమా వెంపర్లాడుతున్నావు... ఆశ వదులుకో....!!*



## కబీరువాణి - 46

 मेरा तेरा मनुआ कैसे एक होइ रे कैसे एक होइ ।
मैं कहता अंख्यिन के देखी तू कहता कागद की लेखी ।
मैं कहता सरझाव नहारी तू एख्यों उरसाई रे ।
मैं कहता तू जागत रहियो तू रहता है सोइ रे ।
मैं कहता निर्मोही रहियो तू जाता है मोही रे ।
सतगुरुधारा निरमल नाहै वाहे तू काया धोइ रे ।
कहत कबीर सुनो भाइ साधो तबहि वैसा होइ रे ॥

 *కబీరు అంటున్నాడు...*
*నీ మనసూ నా మనసూ కలిసేదెలా?*
*కళ్ళతో చూచినదే నే చెప్తా...!*
*నీవు చెప్పేదేమో పుస్తకాల్లోది...!*
*భగవంతుని నీడలో విశ్రమించమని నేనంటాను ...!*
*నీవేమో భ్రమల బంజరులో పరిభ్రమిస్తావు...!*
*నేనెప్పుడూ జాగృతమై మెలగమంటాను .... కానీ*
*నీవెప్పుడూ నిద్రలో మునిగి ఉంటావు ....!*
*మాయా మోహాలను వీడమనే వాడిని నేను ....*
*ఆ ఒరవడిలో కొట్టుకుపోయే వాడివి నీవు ....*
*సద్గురు బోధ .... అది నిర్మలధార ....*
*మనస్కాయముల పునీత మొనరించు ....*
*ఇది తెలిసి మసలుకో .... సద్గతి నందుకో ....!!*

## కబీరువాణి - 47

साधो कोहै कहां से आयो ।
तेहि के मन धो कहां बसत है
कोधो नाच नचायो ।
पावक सब अंग काठ ही में
कोधो डहक जगायो ।
हो गया खाक तेज पुनि बाके
कहुं धो कहां समायो ।
अहै अपार पार कछु नाहिं
सदगुरु जैहै लखायो ।
कहे कबीर जेहि सूझबूझ
जसतेहि तस आज सुनायो ॥

*కబీరు చెప్తున్నాడు ....*
*ఓ సాధూ! ఇది తెలుసుకో ...!*
*నీవు ఎవరు ...? ఎచ్చటనుండి ఇటకు వచ్చావు ...??*
*నీలో ఈ మనసెక్కడ దాగి ఉంది ...? నిన్నెంత ఆడిస్తూ ఉంది ...??*
*కొయ్యలో అగ్గి దాగి ఉంది ..., నిప్పురవ్వ దాన్ని వెలికి తీస్తుంది ...!*
*కొయ్య కాలి బూడిదయింది ..., మరి ఆ అగ్గి ఎక్కడికి వెళ్ళిపోయింది ...?*
*అలాగే ఆ సర్వాంతర్యామి కూడా ...!*
*ఆతనిని సద్గురువు కాక వేరెవరూ ఎఱుక పరచలేరు ...!*
*ఎవరు ఆ సర్వవ్యాపకునెరుంగుదురో వారే ఆతనిని గూర్చి తెలుపగలరు ...!!*



## కబీరువాణి - 48

माया मोहि मोहित कीन्हा ।
ताथै मेरो ग्यान ध्यान हरि लीन्हा ।
संसार ऐसा सुपिन जैसा जीवन सुपिन समाना ।
सांच करि नर गांठ बांधो छाड़ि परम निधाना ।
नैन नेह पतंग हुलसे पसुन पेखै आगि ।
काल पास जु मुगध बांध्या कलंक कामनी लागि ।
करि बिचार बिकार परहरि तिरण तारण सोइ ।
कहे कबीर रघुनाथ भजि नर दूजा कोइ नाहिं ॥

*కబీరు అంటున్నాడు ....*
*నరుడా ...! మాయామోహాల చేరువయ్యాను ...,*
*ఫలితంగా ... జ్ఞానానికీ ... హరిధ్యానానికీ దూరమయ్యాను ...!*
*ఈ జగత్తూ ..., నా యీ జీవనమూ ... ఒక కల అన్న నిజాన్ని మరిచాను ...*
*పరమ నిధానమైన ఆ పరమాత్ముని జారవిడుచుకొని ...,*
*వ్యర్థములైన లౌకిక సంపదలు పోగుచేసికుంటూ ఉన్నావు ...!*
*కనుచూపుకు భ్రమసిన పురుగు ... దీపపు మంటలోపడి మాడిపోయింది ...!*
*కామినులయందు లగ్నమైన మనసు ... నాశనానానికి హేతువవుతుంది ...!*
*ఈ సత్యముల నెఱిగి ... మనోవికారముల పరిత్యజించు ...!*
*అనన్యుడయిన ఆ రఘునాథుని స్మరించు ...!*
*ఆతండొక్కడే ఈ భవసాగరము దాటించగలవాడు ...!!*

## కబీరువాణి - 49

हंस हंस मिले सुख होइ ।
यहां तो पांती है बगुलन की कदर न जानै कोइ ।
जो हंसा तारे प्यास क्षीर को कूपनीर कहीं होइ ।
यहां तो नीर सकल ममता को हंस तज जस चोइ ।
सट दर्सन पाखंड छानवै भेस धरे सब कोइ ।
चार वर्ण और वेद किताबें हंस निराला होइ ।
कहे कबीर प्रतीत मान ले जीव नहीं जाय बिगोइ ॥

*కడు ముదముతో ... హంసలు ముచ్చటించుకుంటున్నాయి.*
*ఈ కొంగలబారులు చూడు ... వీనికి రీతి రివాజులు తెలియకనే పోయె ...!*
*కబీరు అంటున్నాడు ....*
*ఓ హంసా ...! నీకు కావలసినది పాలు కదా ...!*
*బావి నీటితో పని ఏమి ...?*
*ఇక్కడ ఎటుచూచినా నీరే ..., మాయామోహములనే ఆ నీరు త్యజ్యము ...*
*నాలుగు వర్ణాలంటూ ..., వేద వేదాంగ పఠనాలంటూ ...,*
*వేషాన్ని పులుముకుని, విషం గ్రక్కుతూ ఉంటారు ...!*
*కబీరు చెప్పుచున్నాడు ... విను ...!*
*ఆ పరమాత్మని నమ్ముకో ...! నీ నమ్మకం వమ్ముగాదు ...!!*
*(హంస ..., పరమహంస ... ఆధ్యాత్మిక సాధనలోని సోపాన పదాలు)*



## కబీరువాణి - 50

अपनपो आपही बिसरो ।
जैसे सोनहा काच मंदिर में भरमत भूकि मरो ।
जौ केहरी बपु निरखि कूप जल प्रतिमा देखि परो ।
ऐसेहि मदगज फटिक सिला पर असनन आनि आरो ।
मरकट मुठी स्वाद न बिसरो घर घर नटत फिरो ।
कहे कबीर ललनी के सुवना तोहि काने पकारो ॥

*కబీరు అంటున్నాడు ....*
*ఓ నరుడా ...! నిన్ను నీవే మరచితివే ...!*
*అద్దంలో తన బింబాన్ని చూచిన శునకం ...*
*మరో శునకమనే భ్రాంతితో దాడిచేసినట్లు ...*
*బావినీటిలో తన రూపాన్ని చూచిన సింహం ...*
*మరో సింగమని భ్రమసినట్లు ...*
*శిలాఫలకంపైని తన దంతాల ప్రతిబింబం పై దాడిచేసి*
*ఉన్న దంతాన్నొడ్డిన మదగజమట్లు ...*
*పట్టెడు మెతుకుల ఆశతో ... వింతచేష్టలు ప్రదర్శిస్తూ ...*
*ఇల్లిల్లూ తిరుగాడే ... మర్కటం లా ...*
*మోహభ్రాంతులు మనిషిని పట్టి ఆడిస్తున్నాయి ...!*
*వానికి లోబడిన మనిషి ... తన్నుతాను మరచి ...*
*నాశనంవైపు సాగిపోతున్నాడు ...!!*

## కబీరువాణి - 51

- काजी कौन कतेब बसाने ।
  पढ़त पढ़त कते दिन बीते गति एकें नहिं जानै ।
  सकति से नेह पकरि करि सुनति यहुन बहुरे भाइ ।
  जोर गुदाइ तुरक मोहि करता तो आगे कथि की न जाइ ।
  हो तो तुरक करि किया सुनत औरत सो का कहिये ।
  अरध सरीर नारी ना छूटे आधा हिन्दू रहिये ।
  छाड़ि कतेब राम कछु काजी खुन करत हो भारी ।
  पकरी टेक कबीर भगति की काजी रहै झस मारी ॥

- *కబీరు అంటున్నాడు ...*
  *ఓ ... ఖాజీ ...! నీవు ఏ గ్రంథం నుండి చెప్తున్నావు ...?*
  *రేయింబవళ్ళు జదివితివేగానీ ... మర్మమెరుగ కుంటివి ...!*
  *'సున్నత్' అయినవాడే తురక అయితే ...,*
  *వాడే భగవంతుని దయకి పాత్రుడైతే ...*
  *మరి స్త్రీల సంగతి ఏమిటి ...?*
  *వారు భగవంతుని దయకు పాత్రులుగారా ...??*
  *ఛాందసాలు వీడు ...!*
  *ప్రేమ ..., భక్తియే ... భగవంతుని చేరు మార్గము ...!*



## కబీరువాణి - 52

- कथणी बदणी सब जंजाल ।
  भाव भगति अरु राम निराल ।
  कथै बदै सुनै सब कोइ कथै न होइ कीये होइ ।
  कूडी करणी राम न पावै साच टिके निज रूप दिखावे ।
  अटमे अग्नी घर जल अवास चेति बुझाइ कबीरदास ॥

- *వివిధ ప్రబోధాలూ ..., పూజా విధులూ ..., శుద్ధదండగ ...*
  *వీటన్నింటికీ అతీతుడైన ఆ రాముడు ...*
  *ప్రేమ భక్తి సులభుడు ...*
  *ఉపన్యాసాలు వినేవారే గానీ ..., ఆచరించే వారేరీ ...?*
  *పూజా విధానాలూ ..., కర్మకాండలూ ... భగవంతుని చేర్చలేవు ...!*
  *అంతరంగమందెవ్వరు ... ఆ పరమాత్ముని ఆరాధింతురో ...,*
  *వారికే తాను దర్శనమిచ్చు ... పరమపదము ప్రాప్తింపజేయు ...!*
  *కొంగున మూటగట్టుకున్న నిప్పు ... నీ ఇంటిని దహిస్తుంది ...!*
  *నిలువనీడలేనివాడిగా చేస్తుంది ...!*
  *ఈ పూజావిధులూ ..., కర్మకాండలూ ...*
  *నీ పతనానికే దారితీస్తాయి ... జాగ్రత్త ...!!*

## కబీరువాణి - 53

 मन तु पार उतार जैहो ।
आगे पंथी पंथ न कोर कछु मुकाम न पैहो ।
नाहि तँह नीर नाव खेवट ना गुन खेवनहारा ।
धरनी गगन कछु नाहिं ना कछु बार न पारा ।
नहिं तन नहिं मन नहिं अपनपो सुन्न में सुध न पैहो ।
बलिवान होय बैठो घट में वाही ठौरे होई हो ।
बाटहि बार बियारि देख मन अंत कहा मत जैहो ।
कहे कबीर सब छाड कल्पना ज्यों के त्यों ठहरै हो ॥

 *ఓ బాటసారీ! తెరచాపనెత్తి సాగే నీ పయనమెటు?*
*మార్గం కానరాదు ... గమ్యం తెలియరాదు ...*
*నావికుడు లేదు ... చుక్కాని లేదు ... పడవ లేదు ...*
*అసలు నీరే లేదు ...!!*
*భూమీ లేదు ... ఆకాశం లేదు ... ఆదిమధ్యాంతరాలు లేవు ...*
*తనువూ లేదు ... మనసూ లేదు ... అసలు ఇంకేమీ లేదు ...*
*ఆ మహానిశ్శబ్దంలో ... అంతటా వ్యాపించి ఉన్న ఆ మహాశూన్యంలో ...*
*నీవున్నావన్న స్పృహే నీకు తట్టని ఆ సందర్భంలో ....*
*సంకల్పసిద్ధుడవై, అంతర్ముఖుడివై అవలోకించు ... ఆశాతీతుడివై ...*
*ఆ సర్వాంతర్యామి యందే ధ్యాస నిలుపు ...!!*



## కబీరువాణి - 54

 काहे कूं भीति बनाऊँ टाटी ।
ना जानू कहा परि है माटी ।
काहे कूं महल मंदिर चिणाऊँ
मुवा पाछेघडी एक रहणा न पाऊँ ।
काहे कूं छाऊँ ऊँच उँचेरा ।
साढे तीन हाथ घर मेरा ।
कहे कबीर नर गरब न कीजै ।
जेता तन तेता भुइँ लीजै ॥

 *ఈ మేడలూ ... మిద్దెలూ ... నాకెందుకు?*
*మృత్యువు వచ్చిన తరువాత ...*
*నేనిక్కడ ... ఒక్కక్షణం ఉండను గదా ...!*
*ఏ మట్టిలో ... ఈ మేను కలిసిపోనుందో ...*
*ఎవ్వరెఱుగుదురు ...?*
*ఈ చలువ పందిళ్ళూ ..., అంతస్తుల మేడలూ ...*
*వీనితో పని ఏమి ...?*
*చివరకి కావలసింది ...*
*మూడున్నర అడుగుల జాగాయే ... గదా ...!*
*ఓ నరుడా ...! మరెందుకీ ...*
*పనికిరాని డాంబికాలు ...? తాపత్రయాలు ...?*
*నిజంగా ... నీ కెంత అవసరమో ...*
*అంత వరకు తీసికో ....!!*

## కబీరువాణి - 55

□ हरि बिन झूठे सब व्योहार
केतेकउ करे गँवार ।
झूठा जप तप झूठा ग्यान,
राम नाम बिन झूठा ध्यान ।
बिधी न खेद पूजा आचार
सब दरिया में बार न पार ।
इंद्री स्वारथ मन के स्वाद
जहां सांच तंह मांते बाद ।
दास कबीर रहया लौ ल्याइ
धर्म कर्म सब दिये बहाइ ॥

□ *మనసార చేయని రామ ధ్యానము వృథా ...*
*పూజాపునస్కారము లెన్ని వొనర్చిన ... ఏమి ఫలము ...?*
*హరిని ప్రేమించని ...,*
*ఆతనియందు మనసు నిలుపని ...*
*ఆ జపతపాలన్నీ ఏటిపాలే ...!*
*అవేవీ దరికి చేర్చేవిగావు ...!*
*కడు కూరిమితో చేయు నామస్మరణము ...*
*మదిలో గూడుకట్టిన మోహాలోభముల తరిమివేయు ...*
*అందుకే కర్మకాండలూ ...,*
*పూజావిధులన్నీ కట్టగట్టి వాగులో పారవేయి ...!*
*ఆ పరమాత్ముని ధ్యానించు ...,*
*ఆతని ప్రేమకు చేరువవ్వు ...!!*



## కబీరువాణి - 56

□ सरवर तटी हंसिनी तिसाइ।
जुगति बिना हरि जेल पिया ना जाई ।
पिया चाहै तो लै रंग सारी
उडि न सकै दोड पग भारी ।
कुंभ लिये ठाड पनिहारी
गुन बिन नीर भरे कैसे नारी ।
कहे कबीर गुरु एक सुघि बताइ ।
सहज सुनाय मिले राम एइ ॥

□ *చెరువు గట్టున ... హంస ఉన్నది ...*
*కళ్ళముందే నీరున్నది కానీ ...*
*దాహంతో దాని నోరెండుతున్నదాయె ...!*
*బురదలో దాని కాళ్ళు కూరుకుపోయె ...!*
*కదలి వెళ్ళి నీరు తాగలేదాయె ...!*
*మరోచోటకి ఎగిరి వెళ్ళనూ లేదాయె ...!*
*మరి అంతే ... జ్ఞానశూన్యులు ...*
*హరిని పొందలేరు ...!*
*చేదలేకుండా ... బావినుండి నీరు తోడగలరా ....?*
*నాకీ జ్ఞానభిక్ష పెట్టినవారు ... నాగురుదేవులు ...!*
*వారి దయచే ... ఆ పరాత్పరుని చేర గలిగితిని ...!!*

## కబీరువాణి - 57

- ऐसे मन लाह लौ राम रसना ।
  कपट भगति कीजै कौन गुना ।
  ज्यूं मृग नादै बेध्यो जाइ
  प्यंड परे वाकी ध्यान न जाइ
  ज्यूं मीन जल हेत करि जानी प्रान
  तजै बिसरे नहिं पानी ।
  भ्रींग कीट रहे लौ ल्याह ह्वै
  लै लीन भ्रींग है जाइ।
  राम नाम निज अमृत सार सुमरि सुमरि
  जन उतरे पार ।
  कहे कबीर दासन को दासा अब नहिं
  छोडो हरि चरन निवासा ।

- *కపటపూజలు కోటి చేసిన నేమి ఫలము?*
  *మనసార చేసిన ఒక పూజ కోటి ఫలము ....*
  *సంగీతనాదానురక్తితో .... తన ప్రాణాంతకమయిన*
  *వేటగాని బాణాన్ని మృగము గుర్తించునా ...?*
  *తన చుట్టు తిరిగే భ్రమరం చేసే ఝుంకారంలో మునిగిన కీటకం...*
  *చివరకు .... తానే భ్రమరమై పోవదా ...!*
  *అదే చందాన ....*
  *అంత అనురక్తితో చేసిన రామనామస్మరణమే ....*
  *అమృతతుల్యమై .... అద్వైతం సిద్ధిస్తుంది.*
  *ఓ హరీ! నీ చరణకమలములే నా ఆవాసము ....*
  *నీకు నే దాసానుదాసుడను.*



## కబీరువాణి - 58

- जो दीसै सो तो है नाहीं, है सो कहा न जाइ ।
  बिन देखे परतीत न आवै कहे न कोइ पतियाना ।
  समझ होय तो रबैं चीन्हो, अचरज होय अयाना ।
  कोइ ध्यावै निराकार को, कोइ ध्यावै आकारा ।
  जा बिधि इन दोनो ते न्यारा, जाने जाननहारा ।
  वह राग तो लिख्या न जाइ मात्रा लखै न काना ।
  कहै कबीर सो पड़े न परलय सुरत निरत जिनि जाना ।।

- *దేవుడెలా ఉంటాడు ...?*
  *అంటే ... ఎవరూ మాటలలో చెప్పలేరు ...!*
  *ఎందుకంటే ... ఆతడు త్రిగుణాతీతుడు ...*
  *ఆతని ... ఈ కన్నులతో కాంచజాలక ...,*
  *ఆతని ... నమ్మలేని అజ్ఞానంలో ఉన్నారు ...*
  *కానీ జ్ఞానులైన వారికి ...*
  *ఆ పరమాత్ముని ఉనికి అనుభూతమవుతుంది ...!*
  *అవగత మవుతుంది ...!*
  *ఒకరు నిరాకారుడని ధ్యానించితే ...,*
  *మరొకరు సాకారుడని పూజిస్తారు ...!*
  *నిజానికి సగుణ ..., నిర్గుణాలన్నింటికీ అతీతుడైన వాడాతడు ...!*
  *అందుకే కబీరు అంటున్నాడు ...!*
  *ఎవరైతే ఈ సత్యము నెఱింగి ..., రాగబంధన ముక్తుడై ...*
  *నిరంతరమూ ఆ భగవంతుని ఉనికియందే మునిగి ఉంటాడో ...*
  *ఆతనికి అద్వైత సిద్ధి కలుగుతుంది ...!!*

## కబీరువాణి - 59

- जीव महल में सिव पहुनवा कहाँ फिरत उनमाद रे ।
  पहुंचा देवा कर लै सवा रैन चली आवत रे ।
  जुगन जुगन करै पतीछन साहब का दिल लाग रे ।
  सूझत नाहिं परम सुख सागर बिना प्रेम बैराग रे ।
  सरवन सुर बूझि साहब से पूरन परगट भाग रे ।
  कहे कबीर सुनो भाग हमारा पाया अटल सुहाग रे ।।

- *కబీరు అంటున్నాడు ...!*
  *పిచ్చివాడా!*
  *నీ హృదయ మందిరములోనేగద ఆ దేవ దేవుడు కొలువైయున్నాడు ...*
  *నీవేమో అది తప్పించి అన్నిచోట్లా వెతుకుతూ తిరుగుతున్నావు ...*
  *రేయి చీకట్లు ముసరక మునుపే ...*
  *జీవనయానము చరమాంకం చేరక మున్నే ...*
  *త్వరపడు ... ఆ పరమాత్ముని చేరరావో ...*
  *సేవ చేయరావో ... మనసార అర్చించరావో ...*
  *ఆతనిని నీ ప్రేమతో మురిపించు ...*
  *యుగయుగాల నీ ఎదురుచూపులిందుకేగదా ...!*
  *అవధుల్లేని ఆ ఆనందసాగరం నీ సొంతమవుతుంది ...*
  *స్వయంగా ఆ పరమాత్ముడే ఏ తెంచి భక్తి వైరాగ్యాల నెఱిగించుతాడు ...*
  *ఆ స్వామి అచంచల ప్రేమ పొందగలిగిన నేనెంతో ధన్యుడను ...!!*



## కబీరువాణి - 60

- सुख सागर में आयके मत जा रे प्यासा ।
  अजहु समझ नर बावरे जम करत निरासा ।
  निर्मल नीर भरें तेरे आगे पीले स्वासो स्वासा ।
  मृग तृष्णा जल छाड़ बावरे करो सुधा रस आसा ।
  ध्रुव प्रहलाद सुकदेव पिया और पिया रैदासा ।
  प्रेमहिं रस सदा मतवाला एक प्रेम की आसा ।
  कहे कबीर सुनो भइ साधो मिट गइ भय की वासा ।।

- *ఓ సాధూ! మరణం అన్ని ఆశలనూ నేలరాస్తుంది ...*
  *అందుకే జాగ్రత్తపడు ...*
  *ఆనందసాగరం చెంతకు చేరవచ్చి దప్పికతో మరలిపోకు ...*
  *నీ ఎదురుగనే నిర్మలజల ప్రవాహం ...*
  *తనివితీరా త్రాగి పొమ్ము ...*
  *మృగతృష్ణల వెంట వృథా పరుగులేల ...?*
  *మధురసుధారసముండగా ...*
  *ధృవ ..., ప్రహ్లాద ..., శుకదేవ ..., రైదాసాదులందరూ ...*
  *ఆ సుధారసము గ్రోలిన వారే ...!*
  *ఆ అమృతరస పానమే సదా గోరుకొమ్ము ...!*
  *అద్దానిని సేవించిన ...*
  *ఆశల ఝుంఝూటాలూ ..., దుఃఖాలూ ..., భయాలూ ...*
  *నీదరి చేరవుగా ...!!*

## కబీరువాణి - 61

 सांइ से लगन कठिन है भाइ ।
जैसे पपीहा प्यासा बूंद का पिया पिया रट लाइ ।
प्यासे प्राण तलफे दिन रैन और नीर न भाइ ।
जैसे मिरगा सबद सनेही सबद सुनन को जाइ ।
सबद सुने और प्रान दान दे तनि को नाहिं डराइ ।
जैसे सती चढ़ सत ऊपर पिया की राह मन भाइ ।
पावक देखै डरे वह नाहिं हँसते बैठे सदा माइ ।
छोड़ो तन आपनकी आसा, निर्भय है गुन गाइ ।
कहत कबीर सुनो भई साधो, नाहिं तो जनम नसाइ ॥

 *కబీరు అంటున్నాడు ...*
*ఆ పరమాత్ముని చేరుట ఎంత కఠినతరము ...! ఎంత దుర్లభము ...!*
*చాతక పక్షి వర్షపు నీటిబిందువుకొఱకై*
*దివారాత్రాలూ ఎదురుచూస్తూ... చూస్తూ ...*
*దాహంతో ప్రాణాలు కడగడుతున్నా ...*
*వేరే నీటివైపు కన్నెత్తి చూచునా ....!*
*సంగీతనాదానురక్తితో ఆ జింక ... అణుమాత్రము జంకులేక ...*
*వేటగాడు పలికించు మధురనాదము చెంతకు చేఱపోదా...?*
*తన ప్రాణముల సైతము కోలుపోదా ...!*
*చితినెక్కిన సతి ... అగ్గిని చూచి భీతిల్లునా ...?*
*ఆ సతి మదినిండా ... తా చేరబోవు పతి తలపే ...!*
*పెదవులపై సడలని చిఱునగవే ...!*
*అంత నిర్భయంగా ... నీవు పరమపావనుని స్తుతించు ...!*
*ఈ అశాశ్వత తనువు మీద మమకారం వదులుకో ...!*
*పరమాత్ముని చేరుకో ...! లేకుంటే ... నీ ఈ జన్మ వృథా ...! వృథా ...!!*



## కబీరువాణి - 62

 दुइ जगदीस कहां ते आया कहु कौन भरमाया ।
अलह राम करिमा कैसो हजरत नाम धराया ।
गहना एक कनकते गढना, इनि मह भाव न हूजा ।
कहन सुनन को दूर कर पापिन इक निमाज इक पूजा ।
वाही महादेव वाही महमद ब्रह्मा आदम कहिये ।
को हिन्दू को तुरक कहावे एक जमीं पर रहिये ।
वेद कतेब पढ़वे कुतुबा औ मौलाना औ पांडे ।
बेगरि बेगरि नाम धराये एक माटी के भांडे ।
कहहिं कबीर वै दूनों भूलै रामहि किनहू न पाया ।
वो खस्सी वो गाय कटावै बादहिं जनम गँवाया ॥

 *ఈ విశ్వాన జగదీశులిద్దరు ఎక్కడ నుండి వచ్చారు ...?*
*అలా చెప్పి ... నిన్ను ఏమార్చిన వారెవ్వరు ...?*
*పరమాత్ముడొక్కడే ... వానినే 'హజరత్' – 'అల్లా' అన్నాడు ...!*
*'పూజారి' – 'రాము' డన్నాడు ...!!*
*కనకముతో చేసిన నగలు పలురకాలు ...*
*ఏ పేరుతో పిలిచినా ... వానిలోనిదంతా బంగారమే గదా ...!*
*ఒకరు నమాజు చేస్తారు ...! మరొకరు పూజాపునస్కారం చేస్తారు ...!!*
*విధానం వేరైనా ... అర్చించేది ఆ పరమాత్ముడినే ...!*
*మహాదేవు డతడే ..., మహమ్మదు చెప్పిన 'అల్లా' అతడే ...!*
*హిందువెవరు ...? తురక ఎవరు ...??*
*ఆ అందఱూ ఈ నేలపై నడయాడేవారే గాదా ...!!*
*పండితులు వేదం చదువుతారు ...! ముల్లా 'కుతుబా' చదువుతాడు ...!!*
*వేరు వేరు పేర్లు పెట్టుకున్న మట్టిపాత్రలు ...అంతే ...! అంతా ఒక్కటే ...!!*
*పండితుడూ ..., ముల్లా ... ఇద్దరూ తప్పు చేస్తున్నారు ...!*
*నిజానికి ... వారెవ్వరూ ఆ పరమాత్ముని ఎఱుగరు ...!*
*ఒకడు ఆవును చంపి తింటే ..., మరొకడు మేకను చంపి తింటాడు ...!*
*వాటి నెలా చంపాలనే విషయమై తగాదాలు పడుతూ ...,*
*వాళ్ళ జన్మల్ని వృథాగా ..., వ్యర్థంగా ... గడిపేస్తూ ఉంటారు ...!!*

## కబీరువాణి - 63

रस गगन गुफा में अजर झरे ।
बिन बाजा झनकार उठे जहँ समुझ परे जब ध्यान धरे ।
बिन ताल जँह कँवल फुलाने तेहि चढ़ि हँसा केलि करे ।
बिन चंदा उजियारा दरसे जहां तहँ हँसा नजर परे ।
दसबे द्वारे तारी लागी अलख पुरुष जाके ध्यान धरे ।
काल कराल निकट नहिं आवै, काम क्रोध मद लोभ जरे ।
जुगन जुगन की तृष्णा बुझानी कर्म धर्म अध व्याधि टरे ।
कहे कबीर सुनो भाइ साधो अमर होय कबहुं न मरे ॥

*బ్రహ్మానంద సాక్షాత్కారాన్ని కబీరు వర్ణిస్తున్నాడు ....*
*ఆ రూపం ... అపురూపం ...!*
*ధ్యానం ఏకాగ్రమైనపుడు ... అంతర్ బాహ్య స్మృతుల కావల ...*
*కనబడని ఆకాశం నుండి అమృతధారలు కురుస్తున్నాయి ...*
*జంత్ర తంత్ర వాయిద్యాలు లేకుండానే ...*
*ఝంకారనాదం వ్యాపించింది ...*
*అక్కడ సరస్సులేదు ...*
*అయినా పద్మార్కములు వికసించాయి ...*
*హంసలు విహరిస్తున్నాయి ... చంద్రుడు లేడు ...*
*అయినా పండు వెన్నెల ప్రకాశం ...!*
*ఎక్కడచూచినా రాజహంసలే ...*
*వాని నిరంతర ధ్యానం ఆ పరమ పురుషుడే ...*
*కామ, క్రోధ, మద, లోభముల వీడినవాడు ...*
*కరాళ మృత్యువున కతీతుడే ...!*
*ఆశామోహముల వీడిన వానిని కర్మధర్మములు,*
*అఘవ్యాధులు దరిచేరవులే ...*
*అమరుడాతడు ... అమృతాత్ముడు ...!*



## కబీరువాణి - 64

तू ने रात गंवाइ सोयके दिवस गँवायो खाय ।
तेरा जनम अमोल था कौड़ी बदले जाय ।
दुख में सुमिरन सब करे सुख में करे न कोय ।
जो सुख में सुमिरन करो दुख काहे को होय ।
पत्ता टूटा डार से ले गया पवन उड़ाय ।
अबके बिछड़े कब मिलेंगे दूर पड़ेंगे जाय ।
दुरबल को न सताइये, जाकी मोटी हाय,
मुइ खाल की सांस से लोह भसम है जाय ।
कबीरा आप ठगाइये और न ठगिये कोय,
आप ठगे सुख होयगा, और ठगे दुख होय ॥

*కబీరు అంటున్నాడు ... ఓయీ ...!*
*నీ జీవితపు విలువని గ్రహించవైతివి ...*
*గవ్వకు కూడా కొఱగాకుండా చేసికుంటివి ...*
*పగలంతా తిండికొఱకు వెచ్చిస్తావు ...రేయంతా నిద్దురలో గడిపేస్తావు ...!*
*కష్టాలలో అందరూ భగవంతుని తలచేవారే ...!*
*సుఖాలలోనూ ఆ సామిని కొలిచేవాని దఱికి ... కష్టాలేలవచ్చు ...!*
*చెట్టునుండి ఓ ఆకు రాలిపడింది ...*
*గాలి దానినెక్కడికో ఎగురవేసుకు పోయింది ...!*
*ఇపుడు విడిపోతే ... ఇంకా ... ఇంకా దూరం పెరుగుతూనే ఉంటుంది ...*
*మళ్ళీ కలవటమన్నది కలలోని మాటే ...ఈ మాట గుర్తుంచుకో ...*
*నీకు బలమున్నది గదా యని ... బలహీనుని సతాయించకు ...*
*వాని ఉసురు తగిలి తీరుతుంది ...*
*అది ప్రాణంలేని కుమ్మరి తిత్తి ... అయితేనేం ...*
*అది విడిచిన నిట్టూర్పు ... ఇనుమును సైతం భస్మం చేస్తుంది ...!*
*కావాలంటే నిన్ను నీవు వంచించుకో ... ఆనందించుతావేమో ...గానీ ...*
*ఇతరులను మోసగించకు ... అది నీకు దుఃఖకారణమౌతుంది ...!!*

## కబీరువాణి - 65

तेरा जन एक आघ है कोइ ।
काम क्रोध लोभ विवरजित हरि पद चीन्हे सोई ।
राजस तामस सातिग तिन्यू ये सब तेरी माया ।
चौथे पद को जो जन चीन्हे तिनहिं परम पद पाया ।
असतुति निंदा आसा छोड़े तजे मान अभिमाना ।
लोह कांचन समकर देखे ते मूरति भगवाना ।
च्यंतो तो माघो च्यंतामणि हरिपद रमै उदासा ।
त्रिस्ना अरु अभिमान रहित है कहे कबीर सो दासा ॥

*కబీరు అంటున్నాడు ...*
*ఎవరో ఒకరిద్దరు తప్ప నిజమైన భక్తులు ఉండరుగా ...!*
*కామక్రోధముల విడచి ...*
*హరిపదము సేవించెడి వారు బహు అరుదు గదా ...!*
*సత్త్వరజస్తమోగుణములూ మాయేనని ఎరిగి ... వాని నధిగమించి ...*
*నీ చరణు శరణు వేడిన వాడే ... పరమ పదమందగలడు ...*
*స్తుతినిందలకూ ..., ఆశానిరాశలకూ ...,*
*మానావమానాలకూ ... అతీతుడుగా ఎదిగినవాడే ...*
*లోహ కాంచనముల ... సమదృష్టితో చూచిన వాడే ...*
*భగవంతుని పొందగలడు ...*
*అహంకారాన్నీ ..., ఆశామోహాలనీ ...*
*నిర్జించి హరిపద సేవయందు లగ్నమౌతాడో ...*
*అట్టి మహాత్మునికి ... ఈ కబీరు దాసానుదాసుడు ...!!*



## కబీరువాణి - 66

हम को औढावे चदरिया चलती बिरिया ।
प्रान राम जब निकसन लागै
उलट गइ दोउ नयन पुतरिया ।
भीतर सै जब बाहर लाये,
टूट गयी सब महल अटरिया ।
चार जन मिलि खाट उठाइनि,
रोवत लेचले डगर डगरिया ।
कहत कबीर सुनो भाइ साधो संग
चली बस सूखी लकरिया ॥

*ఈ ఆత్మారాముడు ... నను వీడగనే ...*
*కనుగుడ్లు వెనుకకు తిరిగిపోతాయి ...!*
*నా యీ పార్థివశరీరాన్ని ...*
*ఒక తెల్లని గుడ్డతో చుట్టివేస్తారు ...!*
*నా అంతిమయాత్ర మొదలౌతుంది ...!*
*శవాన్ని బయటకు మోసుకొస్తారు ...!*
*ఇంటితో ఉన్న అనుబంధాలన్నీ తెగిపోతాయి ...!*
*నలుగురు కలిసి 'పాడె'ను ఎత్తి ... వగస్తూ ..., రోదిస్తూ ...*
*దారులూ ... డొంకల్లోంచి శ్మశానానికి మోసుకెళతారు ...*
*కబీరు చెప్తున్నాడు ... విను ...!*
*ఆ సమయాన ... నాకు తోడుగా ఉండేవి ...,*
*నాతోపాటు దహనమయ్యేవి ...*
*నను కాల్చు కర్రలే ... గదా ...!!*

# కబీరువాణి - 67

- राम मोहि तारि कहाँ लै जैहो ।
  जो बैकुंठ कहो सो कैसो करि पसाओ मोहि दैहो ।
  जो मोरे जीव दोउ जानत हो तो मोहि मुकति बताओ ।
  एक मेक रमि रहया सबन में तो काहे भरमाओ ।
  मारण तिरण जबे लग कहिये तब लग तत न जाना ।
  एक राम देख्या सबहिन में कहे कबीर मन माना ॥

- *రామా ...!*
  *నా గమ్యమేమిటో ... తెలియజేయుమా ...!*
  *అంత్యమున ... వైకుంఠ మేగెదనంచు ... అందురు కొందరు ...!*
  *జీవాత్మ పరమాత్మ వేరయినచోట ...*
  *ముక్తియన్నది ఏటిమాట ...??*
  *నీవు సర్వాంతరంగుడవు ...!*
  *నీకు నాకు 'అభేద' మన్నది ...*
  *నేనెరిగిన మాట ...!!*
  *మరి 'మరణ' – 'తరణ'ంబులన్న ద్వైదీ భావంబులేల ...!!*
  *నే నెరిగిన రాముడొక్కడే ...!!*
  *నేనమ్మిన అతడే నా గతి ...!!*
  *సర్వాత్మయైన ... పరమాత్ముడాతడు ...!!*



# కబీరువాణి - 68

- साधो सहजे काया सोधो ।
  जैसे बटका बीज ताहि में पत्र फूल फल छाया ।
  काया मध्ये बीज बिराये बीजा मध्ये काया ।
  अग्नि पवन पानी पिरथी नभ ता बिन मिले नाहिं ।
  काजी पंडित करो निरनय कौन आपा माहिं ।
  जल भर कुंभ जल बिच धरिया बाहर भितर सोइ ।
  उनके नाम कहन को नाहिं दूजा धोखा होइ ।
  कहे कबीर सुनो भाइ साधो सत्य सबद निज सारा ।
  आपा मध्ये आपै बोले आपे सिरजनहारा ॥

- *కబీరు అంటున్నాడు ...!*
  *ఓ సాధూ ...! సహజ రీతిని సాధన చేయి ...!!*
  *చెట్టు విత్తునందే ... పత్ర-పుష్ప-ఫలములు దాగియుండు ...!*
  *జీవాత్మయందే ... పరమాత్ముడుండు ...!*
  *పరమాత్మయందుండు అంశ ... జీవాత్మ ...!*
  *'ఆతడు' లేక ...అగ్ని, అనల, అనిలములూ, పృథ్వీ, ఆకాశాది ...*
  *పంచభూతములూ ... లేవు ...!*
  *ఓ కాజీ, పండితులారా ...! మీరు నిర్ణయించండి ...!*
  *ఆ అనంతరూపుని ... తావెక్కడో ...!!!*
  *నీటి కుండను ... జలాశయమునకు తెచ్చారు ...!*
  *కుండ లోపలా, బయటా నీరములే ...!!!*
  *జీవాత్మకూ ..., పరమాత్మకూ ... అభేదమే ...!!*
  *ఓ సాధూ ...! ఈ తథ్యము నెఱుంగు ...!!*
  *మఱోమారు చెప్తున్నాను ... విను ...!*
  *జీవాత్మునియందే ... పరమాత్ముడుండు ...!*
  *ఆ పరమాత్మయందుండు అంశయే ... జీవాత్మ ...!!*

## కబీరువాణి - 69

- या तरवर में एक पखेरू भोग सरस वह डोले रे ।
  बाकी संध लखे नहिं कोइ कौन भाव सों डोले रे ।
  दूर्म डार तँह अति घन छाया पंछी बसेरा लेइ रे ।
  आवे सांझ उड़ि जाय सवेरा मरम न काहु देइ रे ।
  सो पंछी मोहि कोइ न बतावै जो बोले घट छाहि रे ।
  अबरन बरन रूप नहिं रेखा बैठा प्रेम के मांहि रे ।
  अगम अपार निरंतर बासा आवत जात न दीसा रे ।
  कहे कबीर सुनो भाइ साधो यह कछु अकथ कहानी रे ।
  या पंछी कै किन ठौर है बूझो पंडित ग्यानी रे ॥

- *ఆ చెట్టుమీద ఓ పిట్టవుంది ...*
  *నిరంతరం ఆనందడోలికల్లో ఊగుతుంటుంది ...!*
  *మిగతా పిట్టలకి ... అది అనుభవించే ఆనందం గురించే తెలియదు ...!*
  *ఆ పిట్ట గుబురుటాకుల మధ్య ... చల్లని నీడపట్టున గూడు కట్టింది ...!*
  *ఉదయాన్నే ఎగిరిపోయి ... సాయంకాలానికి గూటికి చేరుకుంటుంది ...!*
  *దాని గుట్టుమట్టు లేవీ ... ఇతర పక్షులెరుగవు ...!*
  *అది పాడేపాటేమిటని ... మిగతా పక్షులనడిగితే ...*
  *చెప్పలేక పోయినాయి ...!*
  *అది ఎవరి ప్రేమలో మునిగి ఉందో తెలియదు ...!*
  *దాని రంగురూపులే తెలియవు ...!*
  *దాని రాకపోకలన్నీ ...*
  *అగమ్యములు ... అపారములు ... నిరంతరములు ...*
  *కబీరు చెప్తున్నాడు విను ... ఓ సాధూ! ఇది ఎవ్వరూ చెప్పని కథ ...!*
  *నిజమైన జ్ఞానులూ ... పండితులే ఆ పక్షి ఆనుపానులు ఎరుగగలరు ...!!*



## కబీరువాణి - 70

- मन मस्त हुआ तो क्यूं बोलै ।
  हीरा पाये गांठ गंठियायो बार बार वा को क्यूं खोलै ।
  हलकी थी तब चढ़ी तराजू पूरी भइ तब क्यूं तोलै ।
  सूरत कलारी भइ मतवारी मदवा पी गइ बिन तोलै ।
  हंसा पाये मानसरोवर ताल तलैया क्यूं डोलै ।
  तेरा साहब है घटमाही बाहर नैना क्यूं खोलै ।
  कहे कबीर सुनो भइ साधो साहब मिल गया तिल ओले ॥

- *కబీరు అంటున్నాడు ...*
  *ఓ సాధూ ...!*
  *మనసు ఆనందంతో నిండి ఉంది ...!*
  *మాటలతో పని ఏమి ...?*
  *వజ్రం దొరికింది ...! మూటగట్టుకుని జాగ్రత్తగా పెట్టుకో ...!!*
  *ప్రదర్శనతో పని ఏమి ...?*
  *త్రాసులో సరుకు తేలికగా ఉంటే ...*
  *పళ్ళెం క్రిందకీ పైకీ ఊగుతుంది ...!*
  *నిండుగా ఉంటే ... తొణక్కుండా ఉండేను గదా ...!*
  *మధువు గ్రోలిన మధుపం ...*
  *మాదకతతో ఒక్కచోటే ఉండి పోయింది ...!*
  *మానస సరోవరం చేరిన హంసకి ...*
  *వేరు తటాకములతో ఏమి పని ...?*
  *నువ్వుగింజలో నూనె ఉన్నట్లు ..., నీ 'సాయి' నీలోనే ఉన్నాడు ...!*
  *అనసరంగా కళ్ళు విప్పార్చుకుని ..., బయటెక్కడో వెతుకుతా వెందుకు ...?*

## కబీరువాణి - 71

- तिंबिर सांझ का गहीरा आवै
  छादै प्रेम तन मन में ।
  पछिम दिस का खिड़की खोलो
  डूबहु प्रेम गगन में ।
  चेत कँवल दल रस पीयोरे
  लहर लेहुया तन में ।
  संख घंटा सहनाइ बाजै
  सोभा सिंध महल में ।
  कहे कबीर सुनो भाइ साधो
  अमर साहिब लख घट में ।

- *సంజె చీకట్లు ముసురుకున్నట్లు ...*
  *తనువులో ..., మనసులో ...*
  *ప్రేమ ఉప్పొంగుతున్నది ...!*
  *పడమటి దిక్కున కిటికీ తెరువు ...*
  *ఆ ప్రేమాకాశంలో మునిగిపో ...!*
  *కమలదళ రసము గ్రోలిన ఈ తనువులో ...*
  *చైతన్య లహరులు ఉరకలు వేస్తున్నాయి ...!*
  *వీనులవిందైన షహనాయి ...,*
  *శంఖ ...,*
  *ఘంటానాదాలు ... ప్రతిధ్వనిస్తున్నాయి ...!*
  *ఓ సాధూ ...! వింటున్నావా ...!*
  *నీలో ఉన్న ఆ పరమాత్మను వీక్షించు ...!!*



## కబీరువాణి - 72

- दुलहिन अंगिया काहे न धोवाइ ।
  बालापन की मैली अंगिया बिसय दाग परिजाइ ।
  बिन धोये पिय रीझत नाहिं सेज से देत गिराइ ।
  सुमिरन ध्यान के साबुन करिले सदनाम दरियाइ ।
  दुविधा के भेद खोल बहुरिया मन के मैल धोवाइ ।
  चेत करोतिन पन बीते अब तो गवन नगिचाइ ।
  पालनहार द्वार है ठाडे अब काहे पछिताइ ।
  कहत कबीर सुनोरी बहुरिया चित अंजन दे आइ ॥

- *జీవుని పెండ్లికూతురుగా...*
  *పరమాత్మని ప్రియునిగా నెంచి ... కబీరు అంటున్నాడు...!*
  *ఇంకా స్నానమాచరించలేదేమి?*
  *నీకు ఇంతప్పటి నుండి అంటిన ...*
  *విషయ వికారాది మలినములు ఇంకా వదిలించుకోలేదేమి ...?*
  *అశుభ్రముగానున్న నిన్ను ...*
  *నీ ప్రియుడు తన సరసకు చేరనిచ్చునా ...?*
  *భగవన్నామమనే నీటితో ...*
  *ధ్యాన-స్మరణలనే సబ్బునుపయోగించు ...*
  *ద్వైదీ భావము విడనాడి ...*
  *మనసుకు ఉన్న కల్మషం కడిగివేయి ...*
  *ఇప్పటికే ఎంతో సమయం వృథాగా గడచిపోయింది ...*
  *చరమాంకం సమీపిస్తున్నది ...*
  *ఆ పరమాత్ముడు నీ ముంగిట నిలచియున్నాడు ...*
  *జ్ఞానమనే కాటుక నలదుకొని చూడు ... ఆయన దర్శనమవుతుంది ...!!*

## కబీరువాణి - 73

तरवर इक मूल बिन ठाडा बिन फूले फल लागे ।
साखा पत्र कछु नाहीं वाकै सकल कमल दल गाजै ।
चढ़ तरवर दो पंछी बोलै एक गुरु एक चेला ।
चेला रहा सो रस चुन खाया गुरु निरंतर खेला ।
पक्षी के खोज अगम परघट कहे कबीर बड़े भारी ।
सबहि मूरत बीज अमूरत मूरत की बलिहारी ॥

*అచ్చట ... వేళ్ళు లేకనే చెట్టు ఉన్నది ...!*
*పుష్పించకనే ఫలమునందిస్తున్నది ...!!*
*దానికి ఆకులు లేవు ... కొమ్మలు లేవు ...!*
*అచట వికసించిన కమల దళములు ...!!*
*ఆ చెట్టునెక్కిన పక్షులు రెండు ... మాట్లాడుకొంటున్నాయి ...!*
*ఒకటి గురువు ... మరొకటి శిష్యుడు ...!*
*శిష్యుడు మధుర ఫలాల నెంచుకు ఆరగిస్తున్నాడు ...!*
*గురువు తన ఆటలో మునిగిపోయాడు ...!*
*ఈ రెండు పిట్టలూ వెతికేది ఆ పరమాత్మనే ...!*
*కానీ దొరకటం అంత సులభం కాదు ...!*
*ఆ నిరాకారుడే సమస్త ఆకారములకూ ...*
*మూలమన్న మాట ఎఱుగలేకున్నారు ...!*
*సాకార మూర్తులకు ప్రణమిల్లుతున్నారు ...!!*



## కబీరువాణి - 74

इस दुनिया का नाता न्यारा है ।
माता कहे पुत्र मेरा है, पिता कहे सुत मेरा है ।
ना माता को ना पिता का इस दुनिया का नाता न्यारा है ।
भाइ कहे जोड़ी मेरी है बहन कहे बंधु मेरा है ।
ना भाइ का ना बहन को इस दुनिया का नाता न्यारा है ।
कहत कबीर सुनो भाइ साधो यह पद तो निरबाना है ।
इस पद को जो अरथ करेगा इहि बहुरि न आना है ॥

*ఈ లోకం పోకడ కడు చిత్రము ...*
*సంబంధ బాంధవ్యాలూ అంతే చిత్రం ...*
*తల్లి – వీడు నా కుమారుడంటుంది ...*
*తండ్రి – వీడు నావాడంటాడు ...*
*నిజానికి వాడెవరికీ చెందినవాడు కాదు ...*
*అన్నదమ్ములు – వీడు నా సోదరుడంటారు ...*
*సోదరి – వీడు నా తోడబుట్టిన వాడంటుంది ...*
*నిజానికి వాడెవరికీ చెందినవాడు కాదు ...*
*ఈ లోకం బహు చిత్రంగా బాంధవ్యం కలుపుకొంటుంది ...*
*కానీ ఓ సాధూ ...!*
*అసలు నిజం విను ...!*
*ఈ మానుష జన్మము పరమపద సోపానమునకొక మెట్టు ...*
*ఈ సత్యము గురుతెరిగినవాడు మరలా ఇక్కడకు తిరిగిరాడు ...*
*ముక్తి పదమునంద గలడు ...!!*

## కబీరువాణి - 75

- जब लग तेल जीवर मुख बाती तब लग सूझे सब कोइ ।
  तेल जरे बाती ठहराइ तो नाम न गहे कोइ ।
  काकी माता पिता कहि काकै तू राम नाम जप सोइ ।
  घट फटे कोइ बात न पूछे काढो काढो सब कहि ।
  कहत कबीर सुनहु रे संतो भवसागर के सांइ ।
  इस बंदे जतन जो करे जम ना हटे गुसांइ ॥

- *వత్తికి చమురు అందినంతవరకు ...*
  *దీపం ప్రకాశంగా వెలుగుతుంది ...!*
  *చమురు తరిగి పోయిందా ...*
  *దీపం ఆరిపోయింది ... అలాగే ...*
  *ఊపిరి ఉన్నంతవరకూ నిన్ను గొప్పవాడని పొగిడే వారే ...!!!*
  *ఒకడు తల్లివీ, తండ్రివీ అని పొగడుతాడు ...!*
  *మరొకడు రామనామానికి బదులు ...*
  *నీ నామస్మరణే చేస్తుంటాడు ...*
  *కడతేరిపోయావా ... నిన్నడిగే వాళ్ళే ఉండరు ...!!!*
  *ఇక్కడ నుండి తీసివేయండి ...*
  *తీసివేయండీ - అంటూ తొందర చేస్తారు ...!*
  *ఓ సాధూ ...!*
  *లక్ష ప్రయత్నాలు చేసినా ... యముని పాలుబడక తప్పదు ...!*
  *ఆ పరాత్పరుడొక్కడే ... ఈ భవసాగరమును తరింపజేయగలవాడు ...!!*



## కబీరువాణి - 76

- काया बौरी चलत प्रान काहे रोइ ।
  काया पाया बहुत सुख कीन्हे निति उठ मल धोइ ।
  सो तन छिया छार है जैहो नाम न लैही कोइ ।
  कहत प्रान सुन काया बौरी मोर तोर संग नहिं होइ ।
  तोहि असमित्र बहुत हम त्यागा संग न लीन्हा कोइ ।
  उपर खेत के कुसा मंगाये चांचर चदर के पानी ।
  जीवन ब्रह्म कोइ न पूजे मुरदा के मेहेमानी ।
  सिव सनकादिक अरु ब्रह्मादिक शेष सहस मुख होइ ।
  जो जो जनम लियो बसुधा में थिर रहयो ना कोइ ।
  पाप पुण्य है जन्म संगाती समुझि देख नर सोइ ।
  कहल कबीर सभि अंतर की गति जाने बिरला कोइ ॥

- *పోయే ప్రాణం ... శరీరంతో అంటున్నది ...!*
  *ఓసి ... పిచ్చిదానా ...! ఎందు కేడుస్తావు ...?*
  *నీవు నన్ను భరించి ...,*
  *ఎంతో శ్రద్ధతో నిత్య స్నానాదులతో శుభ్రంగా ఉంచావు ...!*
  *నేను నిన్ను విడచి వెళ్ళే ఈ వేళ దుఃఖించకు ...!*
  *వెర్రిదానా ...! నీ నా కలయిక చిరకాలముండేది గాదు ...!*
  *ఇంతకుమున్ను నీ వంటి మిత్రులెందరినో వీడివచ్చాను ...!*
  *అందరూ 'నేను' వీడిన 'నిన్ను' గురించి ... రోదించేవారే ...!*
  *'నన్ను' గురించి తలచేవారేరీ ...!! పైపై 'కుశలు' కోసుకుపోయేవారే గానీ ...!*
  *పొలానికి నీరు కట్టడం గురించి ... ఆలోచించేవారేరీ ...?*
  *అనిత్యమైన శరీరుని ... ఆదరిస్తారే గానీ ...!*
  *నిత్యుడైన పరబ్రహ్మని ... తలచరేమి ...?*
  *సనకసనాది మునులైనా ..., సహస్రఫణిభూషిత శేషుడైనా ...,*
  *బ్రహ్మయైనా ..., చివరకు ఆ పరమశివుడే అయినా ...*
  *ఈ పుడమిపై జన్మయెత్తిన వాడెవ్వడూ... చిరకాల ముండడు, ఉండబోడు ...!*
  *పాపపుణ్యాలు జన్మ నంటివచ్చు కర్మఫలములు ...!*
  *ఎవరికి ఇది అవగతమౌతుందో ...!*
  *వారే ... సృష్టిరహస్యము నెఱిగిన ... ధన్యాత్ములు ...!!*

# కబీరువాణి - 77

□ अवधू भूले को घर लावै ।
सो जन हम को भावै ।
घर में जोग भोग घर ही में घर तज बन नहिं जावै ।
घर में जुक्त मुक्त घर ही में जो गुरु अलख लखावै ।
सहज सुन्न में रहे समाना सहज समाधि लगावै ।
उन्मुनि रहे ब्रह्म को चीन्हे परम तत्व को ध्यावै ।
सुरति निरति से मेला करके अनहद नाद बजावै ।
घर में बसत बस्तु भी घर है घर ही बस्तु मिलावै ।
कहे कबीर सुनो हो साधु ज्यों का त्यों ठहरावै ॥

□ *ఓ అవధూతా ...!*
*దారి తప్పిన వాడిని ఇంటికి చేర్చే వారంటే నాకెంతో ప్రీతి ...!*
*ఇంటి చెంతనే యోగధ్యానములాచరించవచ్చు ...!*
*మరి ... అరణ్యములతో పని ఏమి ...?*
*ఇంట వుండే ముక్తి యుక్తులు సాధించవచ్చు ...!*
*ఇచ్చటనే గురువు ఆ పరమాత్ముని దర్శనము చేయించవచ్చు ...!*
*సహజస్థితినుండి సమాధిస్థితినీ పొందవచ్చు ...!*
*ఆ పరమతత్త్వమును ధ్యానించి ...*
*ఉన్ముక్తుడవై పరబ్రహ్మమును చేరవచ్చు ...!*
*ఆత్మను పరమాత్మయందు లయించి ...*
*'అనాహతనాదము' వినవచ్చు ...!*
*ఇంటియందు ... అందుండు వస్తువులయందూ ...*
*ఆ పరమాత్మను గాంచవచ్చు ...!*
*అంచేత ఓ సాధూ ...! ఎచ్చటి వారచటనేయుండి ...*
*పరమాత్మ సాధనము గావించవచ్చు ...!*
*ఎంచేతనంటే ... ఆ పరమాత్మ సర్వవ్యాపకుడు గదా ...!!*



# కబీరువాణి - 78

□ जब थै आतम तत बिचारा ।
तब निर बैर भया सबहिन थै काम क्रोध गही डारा ।
व्यापक ब्रह्म सबनि में एकै, को पंडित को जोगी ।
राणा राव कवनसु कहिये कवन बैद को रोगी ।
इन में आप आप सबहिन में आप आप सूं खेले ।
नाना भांति गढ़े सब भांडे रूप धरे धरि मेलै ।
सोच बिचारि सब जग देख्या निरगुण कोइ बतावै ।
कहे कबीर गुणी अरु पंडित मिलि लीला जस गावै ॥

□ *కబీరు అంటున్నాడు ...*
*నేను ఆత్మతత్త్వము అవగతము చేసికొంటున్నప్పటి నుండీ ...*
*కామక్రోధముల వర్జించితిని ...*
*ద్వైదీభావముల నిర్జించితిని ...!*
*పండితుడైనా ..., యోగిపుంగవుడైనా ...,*
*రాజైనా ..., పేదైనా ...,*
*వైద్యుడైనా ..., రోగైనా ...*
*అందరి యందూ సంచరించెడి పరమాత్మ ఒక్కడే ...*
*రకరకాలుగా మలచబడిననూ*
*ఈ ఘటములన్నింటి ధాతువూ ఒక్కటే ...!*
*సర్వవ్యాపకుడైన యాతడు నిర్గుణుడు ...!*
*జ్ఞానులూ ..., పండితులూ ...*
*అందరూ ... ఆ పరమాత్ముని ...*
*లీలావిలాసముల కీర్తించెడివారే ...!!*

## కబీరువాణి - 79

- काहेरी नलिनी तू कुम्हलानी,
  तेरे ही लाल सरोवर पानी ।
  जल में उतपति जलं में बास,
  जल में नलिनी तोर प्रगास ।
  ना तल तपत ना ऊपर आग,
  तोर हेतु कहु का सन लाग ।
  कहत कबीर जो उदक समान ते नाहीं
  मुए हमारी जान ॥

- *కబీరు అంటున్నాడు ...!*
  *ఓ సరోజమా ...!*
  *ఎందుకు ముకుళించుకు పోతున్నావు ...?*
  *నీటిలో పుట్టావు ...!*
  *నీటిలో పెరిగావు ...!*
  *నీటిలోనే విరాజిల్లుతూ కాంతులీనుతుంటావు ...!*
  *భూమిపైని ఆతపము ... నిన్నంటదు గదా ...!*
  *అందరూ నిన్నాదరించువారే ...,*
  *నీ వుండు ఈ నీటికీ ...*
  *నీవన్న కడు కూరిమియే ...!*
  *ఈ నీరములన్న నీకునూ కడు మోహములే ...!*
  *ఈ కమలము - నీరు తీరున ... మనగలవారిని ...*
  *మరి మృత్యువు దఱిచేరదు గదా ...!!*



## కబీరువాణి - 80

- अवधू कुदरत की गति न्यारी ।
  रंक निवाज करे वह राजा, भूपति करे भिखारी ।
  केते लवंग ही फल नहि लागे चंदन फूल न फूलै ।
  मछ सिकरी रमै जंगल में सिंह समुद्रहि डोलै ।
  रोड़ा रुख भये मलयगिरि चहुं दिसि फूटि बासा ।
  तीन लोक ब्रह्मांड खंड में देखे अंध तमासा ।
  पंगुल मेरु सुमेरु उलधै त्रिभुवन मुक्ता डोले ।
  गूंगा ग्यान बिग्यान प्रकासे अनहद वाणी बोले ।
  बांधि अकास पाताल पठावै सेस सरग पर राजे ।
  कहे कबीर राम राजा है जो कछु करे सो छाजे ॥

- *కబీరు అంటున్నాడు ...*
  *ఓ అవధూతా ...! ఆ పరమాత్ముని చేతలు బహు చిత్రములు ...!*
  *ఆతడు తలచిన ... రాజు -పేదవుతాడు ..., బికారి రాజ్యమేలుతాడు ...!*
  *లవంగమునకు ఫలములుండ వేలనో ...!!*
  *చందనమునకు పూలు పూయవెందులకో ...!!*
  *ఆతడు తలచిన ... జాలరి అడవిలో వేటాడుతాడు ...!*
  *అడవిలో సింహాలు ... సముద్రంలో ఈదుతాయి ...!*
  *ఎడారులైన మలయ సానువులనుండి ...*
  *సుగంధాలు నలుదెసల వ్యాపిస్తాయి ...!*
  *ఆతడు తలచిన ... గ్రుడ్డివాడు బ్రహ్మాండములోని ...*
  *ముల్లోకాల తమాషాలూ వీక్షించగలడు ...!*
  *కుంటివాడు ... మేరు పర్వతాన్ని లఘించగలడు ...!*
  *మూగవాడు ... జ్ఞాన ..., విజ్ఞానముల బోధించగలడు ...*
  *'అనాహత నాదము' నాలకించగలడు ...!*
  *పాతాళ ఆకాశము నొక్క చుట్టగా చుట్టి ...,*
  *ఆదిశేషుడు స్వర్గాన రాజ్యమేలగలడు ...!*
  *ఆ పరమాత్ముడు సర్వశక్తిసమున్నతుడు ...*
  *ఆతనికి ఏది నచ్చితే ... అది చేయగలడు ...!!*

## కబీరువాణి - 81

- आल्लालि अल्ला नूर पाया कुदरत के सब बंदे ।
  एक नूरथे सब जग उपजा को भले को मंदे ।
  लोगा भरमन भूलो भारि खालिक खालिक
  खलके खालिकि पूर रहयो सब ठांइ ।
  माटी एक अनेक भांड करे साधु साजन निहारे ।
  ना कछु कोछ माटि के ना कछु कोछ तुम्हारे ।
  सब में सारा एको सोइ उसका किया सब कछु होइ ।
  पछाणि तुम सो एको जाने, बंदा कहिये सोइ ।
  अल्ला अलख न जाइ लखिया गुड़ गुड़ बिना मीठा ।
  कहै कबीर मेरी संका नासि सरब निरंजन दीठा ॥

- *కబీరు అంటున్నాడు ...*
  *సర్వశక్తివంతుడైన అల్లా దయవల్ల ... ఈ సృష్టి జనించినది ...!*
  *ఆతని అభీష్టమునసరించి ... జనించిన ఈ సృష్టిలో ...*
  *ఏది మంచి ..., ఏది కాదు ...?*
  *అవగాహనలేని ఈ ప్రజలు ... అణువణువునా ...*
  *విశ్వమంతటా వ్యాపించిన సర్వేశ్వరుని ఎరుగలేకున్నారు ...!*
  *భాండములు వేరు ...*
  *ధాతువొకటేయన్నమాట ... సాధు జనులు ఎఱుగ గలరు ...!*
  *పైకి కనబడే ఈ వ్యత్యాసాలకి కారణం ...*
  *కుమ్మరీ కాదు ... మట్టీ గాదు ...!*
  *అందరిలో ... అంతటా ఉన్న పరమాత్మ ఒక్కడే ...!*
  *అంతా ఆతని అభీష్టమే ...!*
  *ఆ ఏకేశ్వరుని ఎవడు ఎరుగునో ...*
  *వాడే నిజమైన భక్తుడు ...!*
  *ఆ అఖిలేశ్వరుని దర్శించినవాడు ... మాధుర్యానుభూతినొందగలడు ...!*
  *ఆతని దర్శనమాత్రమున ...*
  *నా సర్వభ్రాంతులూ వీడిపోయినాయి ...!!*



## కబీరువాణి - 82

- अलख अलख निरंजन देव, किहि विधि करों तुम्हारी सेव ।
  बिसन सोइ जाको बिस्तार सोइ कृसन जिनि किए संसार ।
  गोब्यंद ते ब्रह्मांडहि गहै, सोइ राम जो जुगि जुगि रहे ।
  अलह सोइ जिनि रमति उपाइ दसदर खोलै सोइ खुदाइ ।
  लख चौरासी रब परवरौ सोइ करीम जो एतिकरे ।
  गोरख सोइ ग्यान गमि रहै महादेव सोइ जो त्रिभुवन जती ।
  सिध साधु पैगंबर हुवा, जपै सुएक भेषो है जूवा ।
  अपर पार का नाउ अनंत, कहे कबीर सोइ भगवंत ॥

- *కబీరు ప్రార్థిస్తున్నాడు ....*
  *ఓ నిరంజనా ...! ని న్నేరీతి సేవింతు ...?*
  *నీవు అగమ్యుడవు ... అగోచరుడవు ...!*
  *విష్ణువై ఈ జగమంతా వ్యాపించినావు ...,*
  *కృష్ణుడవై ... ముల్లోకాలూ సృష్టించావు ...!*
  *గోవిందుడవై ... సర్వజగత్తునూ రక్షించావు ...!*
  *రాముడవై ... యుగయుగాలుగా నిలిచావు ...!*
  *అల్లావై సర్వప్రాణులకూ జీవన మిస్తున్నావు ...!*
  *ఖుదాయై రక్షిస్తున్నావు ...!*
  *కరీమ్‌గా ... ఈ ఎనభైనాలుగు లక్షల రకాల ...*
  *జీవరాసుల నియంత్రిస్తున్నావు ...!*
  *గోరఖ్‌నాథుడై జ్ఞాన ప్రదానముచేయ ...,*
  *మహాశివుడవై కోర్కెలీడేరుస్తున్నావు ...!*
  *ఎవరేరూపున సేవించిన ... కరుణించెడి త్రిభువన స్వామి యాతడు ...!*
  *ఈ అనంతరూపులూ ఒక్కరివేనన్న ఎఱుక గలిగినవాడే ...*
  *పైగంబరుడవుతాడు ...!*
  *ఆ పరమేశ్వరుని నామములనంతములు ...*
  *ఆతనినే నేను 'భగవంతు'డని అంటాను ...!!*

## కబీరువాణి - 83

जों खोदाय मसजीद बसतु है और मुलक केहिकेरा ।
तीरथ मूरत राम निवासी बाहर करे को हेरा ।
पूरब दिसा हरिका बासा पछिम अलह मुकामा ।
दिल में खोजौ दिल ही में खोजौ इहै करीमा रामा ।
केते औरत मरद उपानी, सो सब रूप तुम्हारा ।
कबीर पौगंज अलह राम का, गुरु पीर हमारा ।।

*కబీరు అంటున్నాడు...*
*మసీదులోనే అల్లా ఉంటే ...*
*మిగతా జగమును కాచు వారెవరు ...?*
*తీర్థస్థలంలోని విగ్రహంలోనే రాముడుంటే ...*
*ముల్లోకాలను పాలించు వారెవరు ...??*
*హరి తూరుపు దిక్కుకీ ..., అల్లా పడమటి దిక్కుకీ పరిమితమైతే ...*
*మిగతా దిక్కుల పాలకులెవరు ...?*
*నిజానికి ... మనసులో ...*
*నీ మనస్సులోనే రాముడూ, రహీమూ కొలువై ఉన్నారు ...!*
*స్త్రీ – పురుషులు ..., వివిధ ప్రాణుల ... రూపంలోనున్నది*
*ఆ ... పరమాత్మయే ...!*
*ఈ కబీరు రామ్‌రహీమ్‌ల పైగంబర్ ...! (పైగంబర్ అంటే భగవంతుని మాటను వ్యాప్తిచేయువాడు–ప్రవక్త)*
*నాకీ శక్తినిచ్చిన వారు ... నా గురుదేవులు ...!!*



## కబీరువాణి - 84

चदरिया झीनि रे झीनि, राम नाम रस भीनि ।
अस्ट कमल का चरखा बनाया पांच तत्व की पूनी ।
नव दस मास बुनन को लागे, मूरख मैली कीनी ।
जब मोरि चादर बन घर आयी रंगरेज को दीनी ।
मूरख लोग भोद नहिं जाने दिन दिन मैली कीनी ।
दास कबीर ऐसी ओढ़ी ज्यूं की त्यूं धरि दीनी ।।

*రామనామ రసమునద్ది ...*
*అందమైన దుప్పటి నేసారు ...!*
*అష్టదళ పద్మాల చరఖాతో వడకిన ...*
*పంచతత్వాల వస్త్రమిది ...!*
*నేయటానికి పది నెలల సమయం పట్టింది ...!*
*తయారయి అతి క్రొత్తగా ఇంటికి వచ్చిన రోజున ...*
*మంచి రంగుతో మెరిసిపోయింది ...*
*కానీ మూర్ఖులు దానిని వాడి ... ఉపయోగించి*
*రోజు రోజుకీ మురికి మురికిగా చేసేసారు ...!*
*ధ్రువుడు ..., ప్రహ్లాదుడు ...,*
*సుదాముడు ..., శుకదేవుడు ...*
*ఆదిగా గల భక్తులందరూ ...*
*దానిని జాగ్రత్తగా మురికి అంటకుండా వాడారు ...!*
*ఈ దాసుడు కబీరు కూడా పదిలంగానేవాడి ...*
*తిరిగి ఇచ్చి వేస్తున్నాడు ...!!*

## కబీరువాణి - 85

- नाम जपन केउँ छोड़ दिया ।
  क्रोध न छोड़ा झूठ न छोड़ा
  सत्य वचन केउँ छोड़ दिया ।
  झूठे जग से मन ललचाकर
  असल बतन केउँ छोड़ दिया ।
  कोड़ि को तो खूब सम्हाला
  लाल रतन केउँ छोड़ दिया ।
  जिस सुमिरन से सुख पावै
  सो सुमिरन केउँ छोड़ दिया ।
  कहे कबीर तेरे राम भरोसे
  तन धन मन केउँ ना छोड़ दिया ॥

- *కబీరు అంటున్నాడు....*
  *రామనామ జపమును వదలి వేసావు ...!*
  *నీవు ... అసత్యాన్ని వీడలేదు ...,*
  *కామ క్రోధాదుల్నీ వీడలేదు ...!*
  *సత్యవచన పరిపాలనని ... పరిత్యజించావు ...!*
  *శాశ్వతస్థానాన్ని వదలివచ్చి ...*
  *ఈ మాయాలోకంపై మోహం పెంచుకున్నావు ...!*
  *విలువైన రత్నాల్ని పారబోసికొని ...*
  *కొఱగాని గవ్వల్ని ప్రోగుచేసికొన్నావు ...!*
  *ఏ నామ స్మరణచే అనంత సుఖము గలుగునో ...*
  *దాన్ని దూరంచేసికొన్నావు ...!*
  *ఆ రాముని మీద నమ్మకముంచి ...*
  *నీ తను, మన, ధనములు ఆతనికెందుకు అర్పించవు ...??*



## కబీరువాణి - 86

- मन तोहे नाच नचावै माया ।
  काम हेतु तन सब दिन नाचै
  जोकरि दिन बिताया ।
  ध्रुव प्रहलाद अटल भइ डाकै
  राज विभीषण पाया ।
  अजहुं सुमिर नरहरि
  नाहो निलज बेहाया ।
  कहे कबीर सुनो भाइ साधो
  गणिका गुमान तोड़ाया ॥

- *కబీరు అంటున్నాడు ...*
  *ఓ మనసా ...!*
  *మాయ నిన్నావరించి ... ఆడిస్తూ ఉన్నది ...!*
  *కామానికి దాసోహమైన ఈ శరీరం ...*
  *దినా లన్నింటినీ వ్యర్థంగా గడిపేస్తున్నది ...!*
  *వీనికి లొంగని ధ్రువుడు ..., ప్రహ్లాదుడు ...*
  *స్థిరచిత్తులైనారు ...!*
  *విభీషణునికి ...*
  *లంకా రాజ్యమే సంప్రాప్తించినది ...!*
  *ఇప్పటికైనా ... ఈ రోజే హరిని శరణువేడు ...*
  *సిగ్గుపడకు ...!!*
  *సాధువంటే ... కామాదుల గర్వమణచేవాడే ...!*

## కబీరువాణి - 87

- सब जग माया गुलाबी रंग लगाया ।
कंकर चुन कर महल बनाया कहता है घर मेरा ।
ना घर तेरा ना घर मेरा चिड़िया रैन बसेरा ।
झूठे घर को घर कहा सच्चे घर की फेरे ।
इस घर से जब उस घर जावै लोग मचावे सोरे ।
रुपया रुपया जमा किया करे लाख करोड़े ।
जब नारायण का हुकुम होवेगा चले रंग को छोड़े ।
रंगी को नारंगी कहा बने दूध को खोया ।
चलती को गाड़ी कहा देखे कबीरा रोया ॥

- *మాయ ఈ లోకానికంతటికీ ... గులాబీరంగు పులిమేసింది ...!*
*రాయి రాయి పేర్చి మహలు కట్టావు ... ఇది నా ఇల్లన్నావు ...!*
*నిజానికి ... ఇది నీదీ కాదు ... నాదీ కాదు ...!*
*పిట్ట ... రాత్రికి గూడులో గడుపుతుంది ...!*
*తెల్లవారి అది విడచి ఎచటికో సాగిపోతుంది ... ఇదీ అంతే ...!*
*నిజం కాని దానిని ... నీ ఇల్లంటున్నావు ...!*
*నిజమైన నీ స్వస్థలాన్ని ... మరచేపోయావు ...!*
*ఈ ఇంటి నుండి ... ఆ ఇంటికి వెళ్ళవలసి వచ్చినపుడు ...,*
*ఈ ఇల్లు ... లోకులపాలై పోతుంది ...!*
*పైసా ... పైసా ... కూడబెట్టి లక్షలూ ... కోట్లూ చేసావు ...!*
*నారాయణుని ఆజ్ఞ అయినపుడు ... అంతా ఇక్కడ వదలిపోవలసిందే ...!*
*పాలు చిక్కబడి ... కోవా అయింది ...!*
*మామూలు రంగును ... కాషాయమన్నారు ...!*
*కానివారిని ... సాధుపుంగవుడన్నారు ...!*
*కదిలే బండిని ... నిశ్చలంగా ఉన్నదన్నారు ...!*
*ఈ రివాజును చూచి కబీరుకు కడుబాధ కలిగింది ...!!*



## కబీరువాణి - 88

- माया तजूं तजि नहिं जाइ फिर फिर माया मोहि लपटाइ ।
माया आदर माया मान, माया नहिं तँह ब्रह्म गियान ।
माया रस, माया कर जान, माया कारनि तजे परान ।
माया जप तप माया जोग, माया बांधे सबहि लोग ।
माया जल थलि माया अकासि, माया व्यापी रही चहुं पासी ।
माया पिता माया माता, अतिमाया अस्तरी सुता ।
माया मारि करे व्योहार कबीर मेरे राम अधार ॥

- *ఈ మాయను ... వదిలించుకుందామని అనుకుంటున్నాను ...!*
*కానీ ... ఇది మళ్ళీ మళ్ళీ నన్ను చుట్టుకుంటూ ఉంది ...!*
*ఈ గౌరవ మర్యాదలన్న ... మాయా రూపములే ...*
*మాయ ఉన్నచోట బ్రహ్మజ్ఞానమునకు చోటుండదు ...!*
*ఈ చేతలు ..., భావాలు ... ఇవన్నీ మాయే ...*
*ఈ మాయా ప్రభావానికిలోనై పరమాత్ముని చేరలేకున్నాము ...!*
*జపతపాలూ ..., యోగయాగాలూ ... మాయే ...*
*అందరూ మాయచే ... ఆవరింపబడి ఉన్నవారే ...!*
*పృథ్వి – ఆకాశం – జలంలోనూ ..., నాలుగు దిక్కులలోనూ ...*
*మాయ అలముకునే ఉంది ...!*
*మాతా పితా బంధములు మాయ ..., భార్యాసుతులు మరీ మాయ ...!*
*కబీరు అంటున్నాడు ...! నా రాముడే నీకు ఆధారము ...!*
*ఆతని సాయముతో ... నేను ... ఈ మాయను వదిలించుకుంటాను ...!!*

## కబీరువాణి - 89

- तीरथ कौन करे हमारे ।
  मन मोही गंगा
  मन मोही जमुना
  मन मोही दान करे ।
  मन मोही माला
  मन मोही मुद्रा,
  मन मोही ध्यान धरे ।
  कहे कबीर सुनो भाइ साधो,
  भटकत कौन फिरे ॥

- *కబీరు అంటున్నాడు ...*
  *నాకు తీర్థయాత్రలతో నేమి పని ...?*
  *నా మనసే ...*
  *పావన గంగా - యమునలు ...!*
  *నా మనసే ...*
  *దానధర్మాదికములు ...!*
  *నా మనసే ...*
  *జపమాల ...!*
  *నా మనసే ...*
  *ధ్యానముద్ర ...!*
  *ఓ సాధూ! అంతా ...*
  *మనసులోనే ఉన్నది ...!*
  *మరి ... తీర్థయాత్ర లెందుకు ...??*



## కబీరువాణి - 90

- नाम हरि का जप ले बंदे फिर पीछे पछतायेगा ।
  तू कहता काया मेरा, काया का गुमान क्या ?
  चांद सा सुंदर मुखड़ा तेरा मिट्टी में मिल जायेगा ।
  वहां से तू क्या लाया बंदे इहां से तू क्या ले जायेगा ।
  मुठी बांध के आया जग में हाथ खुल के जायेगा ।
  बालापन में खेल्या खाया अयी जवानी मस्त रहा ।
  बूढ़ापन में रोग सताया, हाथ पयर कांपन लागा ।
  जपना है तो जपले बंदे आखिर तो मिट जायेगा ।
  कहत कबीर सुनो भइ साधो करनी का फल पायेगा ॥

- *ఓ సాధూ ...! హరినామ స్మరణచేయి ...!*
  *లేకుంటే ... ఒకనాటికి ... నీవు పశ్చాత్తాప పడక తప్పదు ...!*
  *ఈ తనువు ... నాది అనుకుంటావు ...!*
  *దాన్ని చూచుకుని ... నీ కెందుకంత గర్వం ...?*
  *చందమామలాంటి ... నీ మోము ... ఒకనాటికి మన్నుపాలయ్యేను ...!*
  *ఈ లోకానికి వస్తూ ... నీ వేమి తెచ్చావు ...?*
  *వెళుతూ ... ఏమి తీసుకుపోతావు ...??*
  *బిగించిన ... పిడికిలితో పుట్టావు ...!*
  *వెళ్ళేప్పుడు ... ఒట్టి చేతుల్తో వెళతావు ...!*
  *చిన్నతనమంతా ... ఆటపాటలతో గడిచిపోయింది ...!*
  *యౌవనాన్ని ... కామవాసనలతో గడిపేశావు ...!*
  *ముసలితనాన రోగాలు పీడించాయి ...!*
  *కాళ్ళూ ... చేతులూ ... వణకుతుంటాయి ...!*
  *అంత్యకాలము ... సమీపించక మునుపే ...,*
  *ఆలశ్యం చేయక ... భగవంతుని ప్రార్థించు ...!*
  *చేసిన పనిని బట్టే ... ఫలిత మందుతుంది ...!!*

## కబీరువాణి - 91

राम राइ तेरी गति जाणि न जाइ ।
जो जस करिहे सो तस पाइहै राजा राम निआइ ।
जैसी कहे करै जो तैसा तरत न लागे बारा ।
कहता कहि गया सुनता सुनि गया करणी कठिन अपारा ।
सुरहातिण अमृत सरबे लेर भँवर न पाइ ।
अनेक जतन करि निग्रह कीजै बिषै बिकार न जाइ ।
संत करे असंत की संगति तासूं कहा बसाइ ।
कहे कबीर ताके भ्रम छूटे जो रहे राम ल्यो लाइ ॥

*ప్రభూ ...! శ్రీరామా ...!!*
*నీ రీతి నెఱుగ ... నెవరి తరము ...!*
*ఎవరు చేసిన కర్మ ... వారనుభవించక తప్పదన్నావు ...!*
*త్రికరణశుద్ధితో వర్తించినవాడే ...*
*ఈ భవసాగరము తరించగలడన్నావు ...!*
*మాట చెప్పటమూ – వినటమూ ... సులభమే ...!*
*ఆచరణే ... కష్ట సాధ్యం ...!*
*సాధనాపరిపూర్తిలో ... అమృతధారలు కురిసే ... అచ్చోటికి ...*
*అందరూ చేరలేరు ...!*
*ఎన్ని యత్నములు చేసినా ..., ఎంత నిగ్రహము పాటించినా ...,*
*ఈ విషయ వికారములు ... వదిలిపోయేనా ...?*
*సజ్జనుడు ... దుర్జన సాంగత్యము పాలుబడిన ...*
*ఆతని ఏమనవలె ...?*
*ఆ రాముని మనమున నిలిపిన వానికి ...*
*ఈ ఇహలోక భ్రమలన్నీ ... తొలగిపోవా ...??*



## కబీరువాణి - 92

इस धन तन का कौन बड़ाइ ।
देखत नैन में मिट्टी मिलाइ ।
आपन खातर महल बनाया आप तो जाकर जंगल सोया ।
हाड़ जलै जैसे लकड़ी का मौली ।
केस जले जैसे घास की पोली ।
कहत कबीर सुनो भाइ साधो,
आप मुवे इथथे डूब गयी दुनिया ॥

*ఈ సంపద ...*
*ఈ తనువూ ...*
*ఈ నశ్వరముల కేమి విలువ ...?*
*చూస్తూ ... చూస్తూ ఉండగానే ...*
*మట్టిలో కలిసిపోతాయి ...!*
*నీ కోసం నిర్మించబడిన ... దీ మహలు ...*
*కానీ ..., చివరకు ...*
*నీవు వెళ్ళి ... నిద్ర పోయింది ... అడవి గర్భంలో ...!*
*కట్టెలాగా కాలిపోయింది నీ శరీరం ...!*
*కేశాలు ... గడ్డిపోచలుగా దహనమయ్యాయి ...!*
*కబీరు చెప్తున్నాడు ... విను ...!*
*ఓ సాధూ ...!*
*నీ చావుతోనే ... నీ ప్రపంచం ...*
*సమాప్తమై పోతుంది ...!!*

## కబీరువాణి - 93

- मन लागो मेरो यार फकीरी में ।
  जो सुख पाऊं नाम भजन में सो सुख नाहिं अमीरी में ।
  भला बुरा सब की सुनि लीजै कर गुजरान गरीबी में ।
  प्रेम नगर में रहनि हमारी भली बनी आइ सबूरी में ।
  हाथ में कूंडी बगल में सोंटा चारों दिसा जागीरी में ।
  आखिर यह तन खाक मिलेगा कहाँ फिरत मगरूरी में ।
  कहत कबीर सुनो भाइ साधो साहब मिले सबूरी में ॥

- *ఓ మనసా ...! ఓ స్నేహితుడా ...! ఫకీరువై జీవించు ...!*
  *రామనామ స్మరణమందు పొందు ...! పరమ సుఖమును ...*
  *సంపదలు కూర్చలేవు ...!*
  *అందరి కష్టాలూ–సుఖాలూ ... ఓర్పుతో విను ...!*
  *సాధారణంగా జీవించు ...!*
  *పొరుగువారిని ప్రేమించు ...! ఓరిమితో స్వీకరించు ...!*
  *కర్రా - పాఌా చేబూని ... నిన్ను - నీవు ఓ జాగీర్దారని తలచకు ...!*
  *చివఌకు మిగిలేది బూడిదేగా ... ఎందుకు ... నీ కీ మిథ్యా గర్వం ...!*
  *కబీరు చెప్తున్నాడు వినుకో ...!*
  *వినమ్రతతోనే ... ఆ పరమాత్ముని సాధించగలవు ...!!*



## కబీరువాణి - 94

- माटी कहे कुम्हार सूं, तू क्या रुंदे मोय ।
  एक दिन ऐसा होवेगा, मैं रूंदूंगी तोय ।
  आये हैं सो जायेंगे, राजा रंक फकीर ।
  एक सिंघासन चढ़ि चले, एक बंधे जंजीर ।
  दुर्बल को न सदाइये, जाकी मोटी हाय ।
  मुई खाल की सांस से, लोह भसम है जाय ।
  पत्ता टूटा डार सों, ले गई पवन उड़ाय ।
  अबके बिछड़े कब मिलेंगे, दूर पड़ेंगे जाय ।
  सुख में सुमिरन ना किया, दुख में किया याद ।
  कह कबीर उदास की, को सुने फरियाद ॥

- *అడుసు త్రొక్కే ... కుమ్మరితో ... మట్టి అంటున్నది ...*
  *నన్నిలా ... కాళ్ళ క్రింద తొక్కుతున్నావు ...,*
  *ఒక రోజున ... నీవూ నా పాలబడక తప్పదు ...!*
  *నేనూ ... నిన్నిలాగే ... నలిపివేస్తాను ... జాగ్రత్త ...!*
  *రాజైనా ... పేదైనా ... ఫకీరైనా ...,*
  *ఒకరు ... సింహాసన మెక్కి కూర్చున్నా ...,*
  *మరొకరు ... గొలుసులతో కట్టబడియున్నా ...*
  *ఈ నేలమీద కొచ్చిన ... ప్రతివారూ ...*
  *పాడెనెక్కక ... తప్పదు ... తప్పదు ...!*
  *బలమున్నదని ... బలహీను పీడించకు ...*
  *వారి ఉసురు ... తగిలి తీరుతుంది ...!*
  *కొలిమితిత్తి ప్రాణం లేనిదే ... అయినా ...*
  *అది ... లోహపు ముద్దను ... భస్మం చేస్తుంది ...*
  *కొమ్మనుండి ఆకురాలింది ...*
  *గాలి ... దాన్ని ... దూరంగా ఎగురవేసుకుపోయింది ...!*
  *ఇప్పుడు విడిపోయి ... దూరంగా పోతున్న ... నీ ఆత్మ - నీ శరీరం ...*
  *మళ్ళీ కలవటం ... జరుగదు కదా ...!!*

## కబీరువాణి - 95

- जो देखा सो दुखिया देखा,<br>तन धरि सुखी न देखा ।<br>उदे अस्त की बात कहत हौ,<br>ता कर करौ बिचेरवा ।<br>बाटे घाटे सब कोइ दुखिया,<br>क्या गिरही बैरागी ।<br>सुक्राचार्ज दुखही के कारण<br>गभै माया त्यागी ।<br>जोगी दुखिया जंगम दुखिया तापस को दुख दूना ।<br>आसा त्रिसना सब घर व्यापे कोइ महल नहिं सूना ।।

- *జన్మనెత్తి ... సుఖపడిన వాడెవ్వడు ...?*<br>*ఎవరిని చూచినా ... దుఃఖ హృదయులే ...*<br>*రేయింబవళ్ళు ... బాధా పీడితులే ...!*<br>*సంసారియైనా ... బైరాగియైనా ...*<br>*ఇంటనైనా ... వెలుపలనైనా ... అందరూ దుఃఖితులే ...!*<br>*శుక్రాచార్యుడు సైతం దుఃఖకారణమున ...*<br>*తల్లి గర్భమందే ... మాయను త్యజించాడు ...!*<br>*జోగియైనా ... జంగముడైనా ... దుఃఖితుడే ...!*<br>*ఇక ... తాపసి దుఃఖము ... ద్విగుణీకృతము ...!*<br>*ప్రతి ఇల్లు ..., ప్రతి మహలూ ...,*<br>*ఆశామోహములతో నిండినదే కదా ...!*<br>*(ఆశామోహముల వీడనంత వఱకూ దుఃఖము నుండి విమోచన ముండదు)*



## కబీరువాణి - 96

- देह धरे का दंड है,<br>सब काहु को होय ।<br>ज्ञानी भुगते ज्ञान से,<br>मूरख भुगते रोय ।<br>कबिरा मैं तो तब डरों,<br>जो मोही में होय ।<br>नीच बुढ़ापा आपदा,<br>सब काहु में होय ।<br>बंदे केउँ करनी करे,<br>क्यों करे पछिताय ।<br>बोये पेड़ बबूल के, आम कहां ते खाय ।।

- *కబీరు అంటున్నాడు ...*<br>*ఈ దేహము ధరించిన వారెవరైనా ...*<br>*బాధ ననుభవించక తప్పదు ...!*<br>*తన జ్ఞానముచే జ్ఞాని ... బాధింపబడతాడు ...!*<br>*మూర్ఖుడు తన అజ్ఞానమువల్ల ... బాధితుడౌతాడు ...!*<br>*జరా మరణములచేత ... వచ్చిపడే ఆపదలచేత ...*<br>*బాధపడని వాడెవ్వరు ...?*<br>*నే నొక్కడినే కాదు కద ...!*<br>*అంచేత నాకు భయమెందుకు ...?*<br>*ఓయీ ...! కూడనిది చేసేవు ..., తరువాత వగచేవు ...!*<br>*నాటినది రేగు చెట్టు ...*<br>*మామిడి పండ్ల నెలా ఆశిస్తావు ...?*

## కబీరువాణి - 97

- साधो देखते देखन हारा ।
  इस घट अंदर बाग बगीचे
  इसी में सिरजनहारा ।
  इस घट अंदर सात समंदर
  इसमें नौ लख तारा ।
  इस घट अंदर हीरा मोती
  इसी में परखनहारा ।
  इस घट अंदर अनहद बाजै
  इसी में उठत फुँआरा ।
  कहे कबीर सुनो भाइ साधो यही है गुरु हमारा ॥

- *ఓ సాధూ ...! నిన్ను నీవు తఱచి చూచుకో ...!*
  *నీ అంతరంగమందే ... సర్వమున్నది ...*
  *నీ యందే తోటలూ ... వనాలున్నాయి ...*
  *స్వయంగా ఆ సృష్టికర్తే ఉన్నాడు ...*
  *సప్త సముద్రాలూ ... తొమ్మిది లక్షల తారలూ నీ యందే ...*
  *సమస్త అమూల్యములూ ... ఆ సర్వేశ్వరుడూ నీ యందే సమాహితులు ...*
  *ఈ శరీరమందే అనాహత నాదములు ... ధ్వనిస్తున్నాయి ...*
  *అమృతధారలు వర్షిస్తున్నాయి ...*
  *ఇది యంతయు ఎఱుకపరచిన వారు నా గురుదేవులు ...!!*



## కబీరువాణి - 98

- जब में भूला रे भाइ मेरे सदगुरु जुगत लखाइ ।
  किरिया करम आचार छोड़ा, छोड़ा तीरथ का न्हाना ।
  सगरी दुनिया भइ सयानी मैंहि इक बैराना ।
  ना मैं जानु सेवा बंदगी ना मैं घंट बजाइ ।
  ना मैं मूरत धरि सिंहासन ना मैं पुहुप चढ़ाइ ।
  ना हरि रीझे जत तप कीन्हे ना काया को जारे ।
  ना हरि रीझे धोती छाड़े ना पांचौ को मारे ।
  दया रखि धरम को पालै, जग सो रहे उदासी ।
  अपना सा जीव सब को जानै ताही मिलै अविनासी ।
  सहे कुसबद बाद को त्यागै छाड़े गर्व गुमाना ।
  सत नाम ताहि को मिलिहै कहे कबीर सुजाना ॥

- *త్రోవగానక తిరుగాడు నాకు, దారిచూపినవారు ... నా సద్గురువులు ...!*
  *కర్మకాండలూ ... ఆచారవ్యవహారాల ఎఱుక మరిచాను ...*
  *తీర్థయాత్రలూ ..., పుణ్యస్నానాదులూ ... వదిలేశాను ...*
  *తాను తెలివయిన దాన్ననుకొన్న లోకం ... నన్ను పిచ్చివాడని తలచింది ...!*
  *విగ్రహ ప్రతిష్ఠలు చేయలేదు ... పుష్పనైవేద్యా లర్పించలేదు ...!*
  *పూజా పునస్కారాలూ ..., ఆరాధనా విధులూ ... వదిలివేశాను ...!*
  *జపతపము లాచరించలేదు ... యమ నియమముల పాటించలేదు ...!*
  *కానీ ...!*
  *ధర్మ వర్తనము చేసి ... హృదయాన దయను తల్చాను ...!*
  *నశ్వర లోకమన్న ఉదాసీనతనాకు ...*
  *దూషణ భాషణలు సైచినాను ... గర్వాతిశయమును వీడినాను ...!*
  *సహప్రాణులన్న ఆదరముచేసి ..., నాకును తనకు అభేదమునెంచి ...!*
  *ఆత్మయందే ... పరమాత్మ నరసిన నాకు ...*
  *ఆ పరంధాముని ... కరుణాకటాక్షముల కేమి కొదువు ...??*

## కబీరువాణి - 99

 राम भजै सो जाणिये जाको आतुर नाहीं ।
सत संतोष लिये रहे धीरज मन माहीं ।
जन को काम क्रोध व्यापै नाहिं तिष्णा न जरावै ।
प्रफुल्लित आनंद में गोव्यंद गुण गावै ।
जन को परनिंदा भाव नाहिं, अरु असतिन भासे ।
काल कलपना मेटि करि गोव्यंद नाहिं आनै ।
जन समद्रष्टी सितल सदा दविधा नाहिं आनै ।
कहे कबीर ता दास सूं मेरा मन मानै ॥

 *కోరికలతో తల్లడిల్లనివాడు ...*
*సతతము సంతోష మనస్కుడు ...!*
*ఎల్లవేళలా ధైర్యము వీడనివాడు ...*
*కామ క్రోధ తృష్ణ లంటనివాడు ...*
*ప్రఫుల్లితానంద మనస్కుడై ...*
*గోవింద గుణగానముచేసెడివాడు ...*
*పరనింద ... అసత్యములు అంటనివాడు ...*
*మృత్యుభయము నెంచక ...*
*గోవింద పాదాబ్జములయందే ... మనసు నిలుపువాడు ...*
*ఎల్లప్రాణుల ఎడ ... సమదృష్టి పఱపు వాడు ...!*
*ద్వైదీభావముల కతీతుడై ... మన గలవాడు ...!*
*ఆతడే నిజమైన రామదాసుడు ...!*
*అట్టివానికి ... నే ... దాసానుదాసుడను ...!!*



## కబీరువాణి - 100

 मन कै मैले बाहरि उजलो किसौरे ।
खांडे की धार जनकी धरम इसौरे ।
हिरदा को बिलाव नैन बग ध्यानी ।
ऐसी भगति न होइ रे प्रानी ।
कपट का भगति करे जिन कोइ ।
अंत की बेर बहुत दुख होइ ।
छाड़ि कपट भजौ राम राइ ।
कहे कबीर तिहूं लोक बड़ाइ ॥

 *విషయవాంఛలతో నిండిన ...*
*నీ మనస్సు మైలపడింది ...!*
*బాహ్య శరీరాన్ని మాత్రం ... మెరిపించుకుంటున్నావు ...!*
*లాభం ఏమున్నది ...?*
*'కత్తిమీదిసాము' వలె ... భక్తుడు తన ధర్మాన్ని ...*
*నెఱవేర్చాలన్న ... మాటే మఱిచావు ...!*
*కపట హృదయంతో ...*
*కొంగజపం చేస్తే భక్తి-సాధన ... ఫలించదు ...!*
*ఫలితంగా నీవు పొందేది ... కష్టాల కడలి మాత్రమే ...!*
*అంచేత ... కపటాన్ని త్యజించు ...!*
*సద్భక్తి అలవరచుకో ...!*
*అది ముల్లోకముల ... కీర్తించబడుతుంది ...!!*

## కబీరు వాణి - 101

- जहां खिलत बसंत ऋतु राज ।
  जहां अनहद बाजा बाजै बाज ।
  चहु दिसि जोति की बहे धार ।
  बिरला जन कोउ उतरे पार ।
  कोटि कृष्ण जहुं जोडे हाथ ।
  कोटि विष्णु जहं नावे माथ ।
  कोटिन ब्रह्मा पढे पुरान ।
  कोटि महेस धरे जहँ ध्यान ।
  सुर गंर्ध्व मुनि गने न जाय ।
  जहँ साहब प्रगटे आय आय ।
  चोवा चंदन अरु अबीर ।
  पुहुप बासरस रहयो गंभीर ॥

- *ఎచట ఎల్లవేళలా వసంతశోభలు ... వెల్లివిరుస్తాయో ...!*
  *ఎచట అనాహతనాదాలు ... ధ్వనిస్తూ ఉంటాయో ...!*
  *నలుదిక్కులా సహస్రజ్యోతికాంతులు ... వెలుగునింపుతూ ఉంటాయో ...!*
  *ఎచట కోటి కృష్ణులు ... ముకుళితహస్తులై ఉంటారో ...!*
  *కోటి విష్ణువులు ... సాష్టాంగప్రమాణాలు చేస్తుంటారో ...!*
  *కోటి బ్రహ్మలు ... నిత్యపారాయణరతులై ఉంటారో ...!*
  *అగణిత సుర, గంధర్వ, మునిపుంగవులు కైమోడ్చి ఉంటారో ...!*
  *అక్కడ ... అక్కడే ...*
  *ఆ పరాత్పరుడు కొలువైయున్నాడు - !!*
  *చందనాది అద్భుత సుగంధ పుష్పాల సౌరభం ...*
  *వెదజల్లబడే ఆ చోటుకి ...*
  *బహుకొద్దిమంది మాత్రమే చేరగలరు ...!!*

* * * *



